నవ్యసాహితీ నికేతనం - 3

# దేవదత్త

## (నాటకం)

ఋగ్వేదకాలం నాటి గాథ.



కె. యమ్. మున్షీ.

అనువాదం
వేమూరి ఆంజనేయశర్మ.



ప్రకాశకులు
నవ్యసాహితీ నికేతనం
విజయవాడ - 2.

# మనవి

ఋగ్వేదకాలంనాటి ఆర్యగాథకు సంబంధించిన మూడో గ్రంథాన్ని దేవదత్తను ప్రచురిస్తున్నాము. తమ పుస్తకాలను అనువాదంచేసి ప్రకటించుకొనడానికి అనుమతించిన గౌరవనీయులైన కె. యం. మున్షిజీకీ, ముఖచిత్రం తయారుచేసి యిచ్చిన సుప్రసిద్ధ చిత్రకారులు వెంబుగారికీ అభివందనాలు.

ఇట్లు,
ప్రకాశకులు.



# పూర్వకథ

దస్యురాజు శంబరుని సంహారం జరిగింది. భరతులూ తృత్సువులూ కలసి అతనికోటల నన్నింటినీ ధ్వంసంచేసి వేశారు. అగస్త్యమహర్షి ఆజ్ఞప్రకారం ఆర్యసేనలు వేలకొలది దస్యులను సంహరించినవి. అనేక వందలమంది దస్యుస్త్రీలు దాసీలుగా చెరపట్టబడ్డారు.

శంబరకన్య తన భార్య కావడంవల్లనూ, ప్రాణరక్షకురాలు కావడంవల్లనూ ఆమెతో దాసిగా వ్యవహరించడానికి విశ్వరథుడు అంగీకరించలేదు. అంతేగాక అగస్త్యుని కోపాన్ని కూడా లెక్కచేయక దస్యువధను ఆపివేయమని తన సేనలకు ఆజ్ఞనిచ్చాడు.

లోపాముద్ర అగస్త్యాశ్రమంలోనే ఉన్నది.

విజయాన్ని సంపాదించి తృత్సుగ్రామానికి తిరిగివచ్చిన తరువాత భరతులకూ, తృత్సువులకూ మధ్య కలహం ఏర్పడింది.

మైత్రావరుణులు ఉగ్రను దాసిగా సమర్పించవలసినదని విశ్వరథుని ఆజ్ఞాపించారు. అందుకు విశ్వరథుడు అంగీకరించనందున గురుశిష్యుల కిద్దరికీమధ్య తీవ్రమైన వాగ్వాదం జరిగింది. మరునాడు సూర్యోదయం కాకపూర్వమే ఉగ్రను దాసిగా సమర్పించవలసిందేనని అగస్త్యులు శాసించారు.

ఇక నాటకం చదవండి.



# పాత్రలు

| | |
|---|---|
| విశ్వరథుడు | గాధిరాజు |
| ఋక్షుడు | విశ్వరథుని స్నేహితుడు |
| దివోదాసు | తృత్సురాజు |
| సుదాసు | తృత్సుయువరాజు |
| జమదగ్ని | విశ్వరథుని స్నేహితుడు |
| ప్రతర్దనుడు | భరతసేనాపతి |
| వశిష్ఠుడు | ఆర్యఋషి |
| భైరవుడు | దస్యుపురోహితుడు |
| అగస్త్యుడు | ఆర్యఋషి |
| జయంతతృత్సువు<br>జాబాలి తృత్సువు<br>గయతృత్సువు<br>అజీగర్తుడు | తృత్సుజాతికి చెందినవారు |
| వ్యాఘ్రపాదజహ్నువు<br>ప్రతీపభరతుడు<br>కర్దముడు | భరతజాతివారు |
| లోపాముద్ర | |
| ఉగ్ర | శంబరుని కుమార్తె |
| రోహిణి | అగస్త్యుని కుమార్తె |

# దేవదత్త

—

## మొదటి దృశ్యం

(మధ్యాహ్నం రెండు జాములయి ఉంటుంది. తృత్సు గ్రామంలోని సభామంటపంలో అజీగర్తుడు, జయంత తృత్సువు, వ్యాఘ్రపాదజహ్నువు, జాబాలితృత్సువు మొదలైనవారు కూర్చుని జూదమాడుతుంటారు. దగ్గరనే సురాపాత్ర ఉంటుంది. అప్పుడప్పుడు వారంతా సురను సేవిస్తూ ఉంటారు. అజీగర్తుని వయస్సు షుమారు ముప్పయి సంవత్సరాలుంటుంది. అతడు ఎక్కువగా తాగి వుంటాడు. మిగతావారందరి వయస్సూ సుమారు దాదాపు ఇరవైఐదు సంవత్సరాలుంటుంది).

జయంతతృత్సువు:—(గవ్వలు విసరి) అజీగర్తా! నీ కథ సగంలోనే ఉండిపోయింది. పూర్తిచేయి.

అజీగర్తుడు:—నన్నుగూడా పందెంవెయ్యనీ (గవ్వలు విసురుతాడు) ఇవాళ ఏమీ కలిసిరావడంలేదే!! (పందెం లెఖ్ఖపెడతాడు)

వ్యాఘ్రపాదజహ్నువు:—(పెద్దగా అరచి) తప్పులెఖ్ఖపెడుతున్నావు. మళ్ళీలెఖ్ఖపెట్టు.

అజీగర్తుడు:—నేను సరిగ్గానే లెఖ్ఖపెట్టుతున్నాను.

జయంతత్ర్రుత్సువు:—ఇలాచేస్తే గవ్వలన్నీ దూరంగా పార వేస్తాను.

వ్యాఘ్రపాదజహ్నువు:—నేను సీతల పగలగొడతాను.

జయంతత్ర్రుత్సువు:—అజీగర్తుడు కథపూర్తిచేయలేదోయీ!

వ్యాఘ్రపాదుడు:—నేను గూడా వింటాను, అజీగర్తుణ్ణి కథ చెప్పమను. (గవ్వలు విసరుతాడు)

అజీగర్తుడు:—నేను ఆరోజురాత్రి ఆమెను అతిథిగ్వాని ఉద్యాన వనంలోనూ, అగస్త్యుని ఆశ్రమంలోనూ, నదీ తటంమీాదా విహరిస్తూఉంటే చూచాను. సాక్షాత్తూ ఇంద్రాణిలాగా ఉన్నది. ఒరేయి! ఆమె ఏమి నవ్వించిరా!!

జయంతత్ర్రుత్సువు:—చంపావురా. నిజంగానీవు చాలా అదృష్ట వంతుడివిరా. (జాబాలుని వంకచూచి) ఒరేయి జాబాలీ! పందెంవెయ్యి (అజీగర్తునితో) గడచినరాత్రి ఆమెనివసించే పర్ణకుటీరం దగ్గరనే నిలబడ్డారా (దీర్ఘంగా నిట్టూర్చి) కాని, ఆమె ఛాయగూడా కనపడలేదు.

వ్యాఘ్రపాదజహ్నువు:—ఆమెదర్శనం లభించవలెనంటే దేవతల దయ కావాలిరా! దేవతలదయ కావాలి.

జాబాలి:—(గవ్వలు విసురుతూ) పందెం సరిగ్గా పడడం లేదురా.

అజీగర్తుడు:—ఇవాళ మనకు పందెం పడదురా. మనస్సు ఇక్కడుంటేగదరా? (ఒకగుక్క మద్యాన్నితాగి) నీవు గూడా వస్తావా? నేనక్కడికే పోతున్నాను. ఆమెను చూడ

డానికి జనం గుంపులు గుంపులుగా చేరారటరా. అడుగో, ఋక్షుడుగూడా వస్తున్నాడు. ఇక చాలు లేవోయి ఆట. (జయంతునితో) ఒరేయి, ఈ ఋక్షుడు నిజంగా అదృష్టవంతుడురా. ఆమెతో కలసి ఎంతో కాలం ఉన్నాడు.

(ఋక్షుడు ప్రవేశిస్తాడు. కొత్తధోవతి ధరించిఉంటాడు. బిగ్గరగా నవ్వుతూ ఉంటాడు, ద్వంద్వ శరీరం.)

ఋక్షుడు:—నేనుగూడా వచ్చానోయి, కొంచెమైనా మిగిలించారా లేదా ? (సురాపాత్రను చూస్తాడు) గొంతు ఎండిపోతున్నది.

జయంతతృత్సువు:—మిగిలివున్నది లే, రా! కూర్చో. కాని ఒక్క సంగతి. భగవతికి సంబంధించిన వివరాలన్నీ చెప్పాలి.

ఋక్షుడు:—తప్పకుండా (జయంతుడు పానపాత్రను అందిస్తాడు ఋక్షుడు తాగుతాడు.)

అజీగర్తుడు:— ఎక్కడికోయి బయలుదేరావు ? విశ్వరథుని దగ్గర కేనా ?

ఋక్షుడు:—విశ్వరథునిదగ్గర కెందుకురా ? ఆ అమావాస్య లాంటి శాంబరి పట్టుకొన్నదిరా విశ్వరథుణ్ణి. అతణ్ణిచూస్తే జాలి వేస్తున్నది.

జయంతతృత్సువు:—అయితే ఎక్కడికి బయలుదేరావు ?

ఋక్షుడు:—ఏమిటోయి ఆ దద్దమ్మప్రశ్నలు? ఎక్కడినుంచి వస్తున్నావు అని అడగలేవూ ?

(అందరూ పకపక నవ్వుతారు)

జయంతభృత్యుడు:—సరే, ఎక్కడినుంచివస్తున్నావో చెప్పు.

ఋక్షుడు:— (నవ్వుతూ) నేను వరుణభవనంలోనుండి వస్తున్నాను........సూర్యాశ్వాల గిట్టలక్రిందపడి కూడా అపాయంలేకుండా బయటబడ్డాను......అయినా ఉషను నేను దర్శించాను...దర్శించాను. ఏమిరంగు......ఏమి కాంతి...ఏమి తేజస్సురా...ఒరేయి...దర్శించానురా.

జాబాలి భృత్యుడు:—ఏమిటిరా నీ ఉపన్యాసం...ఆదిత్యునికి నీ వంటే చాలాదయ అని మాకు తెలుసు. అదిగాదు మేమడిగేది. భగవతివిషయం చెప్పు.

వ్యాఘ్రపాద జహ్నువు:—ఆమె మా విశ్వరథుని ప్రేమించిందంటారు, నిజమేనా ?

జాబాలి:—శంబరుడు ఆమెనుచూచి ముగ్ధుడైనాడటగా ?

ఋక్షుడు:—(ఆడంబరంగా) ఓ నా మిత్రులారా! అనవసరమైన ప్రశ్నలడిగి కాలహరణం చేసుకోకండి. నోరుమూసుకొని తదేకధ్యానంగా నేను చెప్పేమాటలను వినండి. ఆమెను చూచినదగ్గరనుండి దివ్యవిద్య నానాలుకమీద తాండవమాడడ మారంభించింది. (కొంచెంసేపు ఆగి) మిత్రులారా! ఇదే నాచివరి నమస్కారం. నేను భృత్యుగ్రామాన్ని వదలి వెళ్ళిపోతున్నాను............వెళ్ళిపోతున్నాను.

జయంత భృత్యుడు:—ఏమిటిరా ఈ పిచ్చిప్రలాపాలు? చుక్క ఎక్కువైనట్లుంది.

ఋక్షుడు:—తృత్సువులలో పిరికివాడవైన జయంతుడా! నీ ఉషస్సు దివ్యత్వంకంటే గూడా అధికమైన దివ్యత్వాన్ని నేను అనుభవించానురా.

వ్యాఘ్రపాదజహ్నువు:—దేవతలనుగూడా అవమానించబోకురా.

ఋక్షుడు:—(గంభీరంగా) ఆ ప్రకాశాన్ని నేను ఈ కళ్ళతో దర్శించాను.

అజీగర్తుడు:—ఏమిటోయి ఈగోల సరిగ్గా, చెప్పు.

ఋక్షుడు:—అయితే వినండి చెపుతున్నాను. భరద్వాజుని కుమార్తె భగవతి రెండుమూడు రోజుల్లో ఈఆశ్రమాన్ని వదలిపెట్టి వెళ్ళిపోతున్నది.మీరంతా... ...మీరంతా... గబ్బిలాలలాగా ఇక్కడే వ్రేలాడుతూ ఉండిపోతారు.

వ్యాఘ్రపాదజహ్నువు:—(వీపుమీద ఒక్కదెబ్బవేసి) సరిగ్గా చెప్పిఏడువు. లోపాముద్ర ఆశ్రమాన్నివదలి వెళ్ళిపోతుందంటావా? ఎప్పుడు? ఎక్కడకు? చెప్పరా!... ఎప్పుడు వెళ్ళిపోతుందిరా?

ఋక్షుడు:—(పిచ్చివానిలాగా నవ్వుతూ) ఓరి మూర్ఖులారా! దుర్గమవుత్రుడూ, అగస్త్యశిష్యుడూ అయిన ఋక్షుడు ఆశ్రమాన్ని వదలినప్పుడురా...

వ్యాఘ్రపాదజహ్నువు:—సరిగ్గా జవాబు ఇవ్వకపోతే రెండు చెంపదెబ్బలు తగిలిస్తాను.

ఋక్షుడు:—అయితే వినరా. నేను లోపాముద్ర శిష్యరికాన్ని అంగీకరించాను. గురువెక్కడఉంటే శిష్యుడక్కడేగదరా?

జయంతకృత్స్నవు:—అయితే అగస్త్యులవారిని వదలిపెడతా వన్నమాట.

ఋక్షుడు:—జయంతా ఇది విను. చంద్రుడు ఉదయించిన తరువాత నక్షత్రాలసంగతి ఎవరైనా ఆలోచిస్తారా. నేను ఇంతకుముందే గురువుగారి ఆశ్రమానికి పోయినాను. లోపాముద్ర నదిలోస్నానంచేసి ఆశ్రమంలోనికి వస్తున్నది. నమస్కారం చేశాను. శతంజీవివి కమ్మని ఆశీర్వదించింది. స్నేహితులారా! తరువాత నవ్విందిరా. ఆహాహా! ఏమి ఆ నవ్వు!! ఏమి ఆ నవ్వు !!

జయంతకృత్స్నవు:—తరువాత ?

ఋక్షుడు:—తరువాత ఇంకా ఏమున్నది? నా హృదయం ఉప్పొంగిపోయింది. భూమిచుట్టూ అంధకారం వ్యాపించి నట్లనిపించింది. ఆమె నేత్రాలలో దివ్యజ్యోతి దృష్టిగోచర మయింది. ఆమె నిలబడి ఉన్నది... ... ...

బాజాలి:— తరువాత ?

ఋక్షుడు:—అంతతొందరెందుకురా ? తరువాత చేతులు జోడించి హే! భగవతీ! నన్ను శిష్యునిగా స్వీకరించ మన్నాను.

అజీగర్తుడు:—తరువాత? ఆవుతావేమిరా, చెప్పరా?

ఋక్షుడు:— (విజయగర్వాన్ని అభినయిస్తూ) తరువాత, మూర్ఖులారా! ఆజ్యోతిర్మయి, ఆతపఃపూత ఉదయార్కుని స్వర్ణబింబంలాంటి ఓష్టాలతో, ఆడ నెమలి కేంకారంలాంటి అమృతమయమైనవాణితో—"వత్సా! అక్కడ గొప్ప

తపస్సు చేయవలసిఉంటుంది” అన్నది. దుర్దముని పుత్రునికి తపస్సంటే భయంలేదు అన్నాను.

అజీగర్తుడు:—ఆమె ఏమన్నది?

ఋషీకుడు:—అయితే తప్పకుండా నాతోరా అన్నది.

అజీగర్తుడు:—నిజంగా నీవు చాలా అదృష్టవంతుడివిరా. దేవతలకు నీవంటేఅభిమానం ఎక్కువయిందిరా. శంబరుడు నిన్ను బంధించి తీసుకొనిపోయినప్పుడు నన్నుగూడా తీసుకొనిపోతే బాగుండేది.

జయంతతృత్సువు:—అయితే, నేనుగూడా మీతోవస్తాను. అగస్త్యాశ్రమంలో విద్యాభ్యాసం బాగా జరగడంలేదు.

జాబాలితృత్సువు:—అయితే నేను గూడా వస్తాను.

అజీగర్తుడు:—నేనూ వస్తానోయి,పదండి. అందరం పోదాము. (ప్రతీప భరతుడూ, గయతృత్సువూ కోపంతో ప్రవేశిస్తారు. ప్రతీపుని నడుమున కత్తి వ్రేలాడుతూ ఉంటుంది. గయుని భుజంమీద బాణాలతో నిండిన తూణీరం, చేతిలో ధనుస్సూ ఉంటవి. అందరూ లేచి నిలబడతారు)

గయతృత్సువు:—రేపు సూర్యోదయంలోపల విశ్వరథుడు శాంబరిని వదలిపెట్టకపోతే తృత్సువుల భుజశక్తిని మీవిశ్వరథుడూ, మీరూ రుచిచూస్తారు.

ప్రతీపభరతుడు:—చాలుచాలు ఆపు. భరతుల సహాయంలేకపోతే మీ తలకాయ, మీరు ఏమిచేయ గలిగేవారు?... మా కౌశికుడు లేకపోతే మీ రేమయిపోయేవారో!! కౌశికుని అవమాన పరుస్తున్నావా? ఇక ఆపు.

గయతృత్సువు:—(కోపంతో) కౌశికుని సహాయంవల్లనే అతిథిగ్వునిరాజ్యం నిలబడ గలిగింది అనికూడా అను. నోటికి అడ్డు ఏమున్నది ? తృత్సువులకు ఈనాడు లభించిన కీర్తి అంతా పాపం, మీా భరతులవల్ల లభించినదేకదూ ? కొయ్యి సొరకాయలు,

వ్యాఘ్రపాదజహ్నువు:—(ఉత్తేజితుడై) ఆ మాటలో అసత్య మేమున్నది ? మేము లేకపోతే ఈ తృత్సువులు రాజ్యం చేయగలిగేవారా ? రాజ్యసంచాలనం అంటే ఏమిటో మీాకు అసలు తెలుసునా అని నా అనుమానం.

గయతృత్సువు:—ఓహోహో ! నీవుకూడా ఉపక్రమించావు ! విశ్వరథుడు మా వల్లనే మనుష్యుడైనాడన్న సంగతి మరచిపోబోకు,

జయంతతృత్సువు:— (గర్వంగా) ఒక అమావాస్యకొరకు ప్రాణాన్ని, రాజ్యాన్ని వదలడానికి సిద్ధపడ్డాడు. ఆహోహో ! ఎంత గొప్పవాడు కౌశికుడు !!

ప్రతీపభరతుడు:— ఆ ముసలివాడు మా భరతశ్రేష్ఠుణ్ణి ఏమిచేయ గలుగుతాడో చూస్తాముగదా ?

జయంతతృత్సువు:—ఇలాగే డంబాలు మొదలుబెడితే అగస్త్య మహర్షి శాపంపెట్టి మిమ్మల్ని అందరినీ భస్మం చేయ గలడు.

ప్రతీపభరతుడు:— చేశాడులే భస్మం ? మా కౌశికునివంటి ఇంకొక ఋషిని చూపించు. అగస్త్యమహర్షి మా కౌశికుని దగ్గర ఎంత నేర్చుకోవాలో ?

గయత్రృత్సువు:— (బెదరిస్తూ) పిట్టకొంచెం కూతఘనంగా ఉన్నది. నోరుమూయిస్తాను.

ప్రతీపభరతుడు:— ఎవడురా నోరుమూయించేది ?

వ్యాఘ్రపాదజహ్నువు:—నోరుమూయించండి. చూదాం రండి. సాహసముంటే ముందుకురండి. ఇలాంటి చచ్చుత్రృత్సువుల్ని చాలామందిని చూశాము

గయత్రృత్సువు:—(వ్యాఘ్రపాదుని ఒక చెంపదెబ్బకొడతాడు) నీలాంటి పిచ్చిభరతుల్ని రోజూ వగదలమందిని చూస్తున్నాను.

(అందరూ కలబడతారు ముష్టియుద్ధం జరుగుతుంది)

ప్రతీపభరతుడు:—అయితే భరతులప్రతాపం ఎలాఉంటుందో చూడు. (ఒక్క గుద్దుగుద్దుతాడు. గయత్రృత్సువు క్రింద పడిపోతాడు. ప్రతీపుణ్ణి అజీగర్తుడు పట్టుకొని ఆపుతాడు. గయుని కొంతమంది ఆపుతారు. ఋక్షుడు ద్యూతమందిరం దగ్గర కాపలాకాచే అశ్వ్యపుని పిలుస్తాడు.)

ఋక్షుడు: —అశ్వ్యపా !అశ్వ్యపా ! (రాజమార్గంవంకచూచి) అరే! యువరాజు వస్తున్నాడు

(యువరాజు దివోదాసుని పుత్రుడు సుదాసు ప్రవేశిస్తాడు. మంచిదుస్తులను ధరించి ఉంటాడు.)

సుదాసు:—ఏమిటి ఈ అల్లరి ?

(సేనాపతి ప్రతర్దనుడు ప్రవేశిస్తాడు.)

ప్రతర్దనుడు:—వ్యాఘ్రపాదా ! ప్రతీపా !

(అందరూ ముష్టియుద్ధం మానేస్తారు)

ఋక్షుడు:— యువరాజా! సేనాపతీ! వీళ్లు చూశండి, ఎలా తగాదా లాడుకొంటున్నారో.

సుదాసు:— గయా! ఏమిటి సంగతి?

గయతృత్సువు:— రాజన్! ఈ భరతులు గురువర్యునీ, అతిథిగ్వ మహారాజులనూ, తృత్సుజాతినీ అవమానిస్తున్నారు. తృత్సువులందరూ వీరి మోచేతిక్రింది నీళ్లు తాగుతున్నారా?

సుదాసు:— (కోపంతో) ఎవరన్నారు? ఎవరికి అంత సాహసం కలిగింది?

గయతృత్సువు:—(తిరస్కార పూర్వకంగా) వీరు తమ విశ్వరథుని... ... ...

ప్రతర్దనుడు: (కత్తిపిడిపై చేయినుంచి) గయుడా! విశ్వరథుని గురించి అవమానకరంగా మాట్లాడినావంటే... ... ...నీ శిరస్సు నిలవదు.

సుదాసు:— సేనాధిపతీ! నాముందే తృత్సువులను బెదిరిస్తున్నావన్నమాట.

ప్రతర్దనుడు: - (కఠోరంగా) భరతశ్రేష్ఠుని అవమానించిన వాడు ఈ భూమిపై బ్రతికిఉండడానికి వీలులేదు. (ఉద్ధతంగా) ఇక్కడ ఎవరున్నా నాకేమీ భయంలేదు.

సుదాసు:—(క్రోధంతో కంపించిపోతాడు) అయితే నన్ను అవమానించినవాడుగూడా బ్రతికిఉండడానికి వీలులేదు. (కత్తిబయటకు లాగుతాడు. ప్రతర్దనుడుగూడా కత్తిని బయటికి లాగుతాడు. అగస్త్యమహర్షి ప్రవేశిస్తాడు.)

అగస్త్యుడు:—ఏమిటి? మీరిద్దరుగూడానా?

ప్రతర్దనుడు:—(నమస్కారంచేసి) భగవన్! భరతశ్రేష్ఠుని అవమానపరచినవారిని భూమిమీద బ్రతికి ఉండనివ్వ నన్నాను.

సుదాసు:—గురువర్యా! ఈ భరతులు నన్ను వేధిస్తున్నారు. ఎక్కడికి పోదలచుకున్నారో వారిని పోనివ్వరాదా? తృత్సు గ్రామంలో వారైనా ఉండాలి లేక నేనైనా ఉండాలి. అంతే.

అగస్త్యుడు:—(కఠోరంగా) అంటే?

ప్రతర్దనుడు:—భరతులారా! అందరూ ఇళ్ళకుపొండి. రేపు అందరమూ భరతగ్రామం వెళ్ళిపోదాము.

అగస్త్యుడు:— మీరిద్దరూ రాజప్రాసాదంలోనికి పదండి. నే నిప్పుడే వస్తున్నాను. (సుదాస, ప్రతర్దనులు వెళ్ళి పోతారు)

ఋక్షుడు:—గురువర్యా! నమస్కారం. నాది ఒక కోరిక.

అగస్త్యుడు:—ఏమిటి ఆకోరిక?

ఋక్షుడు:—(నవ్వి) శిష్యులుకోరడం, గురువులు ఆ కోరికను తీర్చడం లోకసమాజమేగదా?

అగస్త్యుడు:—సరే.

ఋక్షుడు:—గురుదేవా! నేను మీ ఆశ్రమం వదలిపెట్టిపోవ లెనని అనుకుంటున్నాను.

అగస్త్యుడు:—సరి, మంచిదే.

జయంతతృత్సువు:—నేనుగూడా.

అగస్త్యుడు:—(కఠోరంగా) మంచిది.

జాబాలిత్రృత్సవు:—నేనుగూడా

వ్యాఘ్రపాదజహ్నువు:—గురువుగారు అంగీకరిస్తే నాదిగూడా అదేఉద్దేశ్యం.

అగస్త్యుడు:—ఎందువల్ల ?

ఋక్షుడు:—మేమందరం భగవతి లోపాముద్రవెంట విద్యాభ్యాసం చేయడానికి ఆమె ఆశ్రమానికి వెళ్ళిపోదామని నిర్ణయించుకొన్నాము.

అగస్త్యుడు:—ఆమె అనుజ్ఞను తీసుకొన్నారా ?

ఋక్షుడు:—నేను ఆమె అనుజ్ఞ తీసుకొన్నాను.

అగస్త్యుడు:—(ఉదాసీనంగా) మంచిది. (వెళ్ళిపోబోతాడు.)

ఋక్షుడు:—భగవతి రెండుమూడురోజుల్లో ఇక్కడినుండి వెళ్ళిపోతుంది. మేముగూడా ఆమెతోపాటే వెళ్ళిపోతాము.

(ఒక ఆర్యుడు ప్రవేశిస్తాడు.)

ఆర్యుడు:—(చేతులు జోడించి) గురుదేవా! అతిథిగృహా భగవతి లోపాముద్రా ఇటు వస్తున్నారు.

అగస్త్యుడు:—ఆర్యులకు ఈ సభాభవనంలోనికి ప్రవేశంలేదు. (వెళ్ళిపోతాడు.)

వ్యాఘ్రపాదజహ్నువు:—(సంతోషంతో) భగవతి ఇక్కడకు వస్తున్నదా! సంతోషకరమైన విషయం.

ఋక్షుడు:—(నవ్వి) గురుదేవులు వృద్ధులైపోయినారు. భగవతికి

ఇక్కడకు ప్రవేశం లేదంటారేమిటి ? ఆమె ఇక్కడకువస్తే ఆయన కేమినష్టం?

జయంతకృత్స్నువు:—నాకు తెలుసును. ఆమెను చూడగానే గురువుగారి హృదయం కంపించిపోతుంది.

(అందరూ నవ్వుతారు )

ఋక్షుడు:—నా హృదయంగూడా కంపిస్తున్నది. ఆ సురా పాత్రను ఇటు తీసుకొనిరా.

వ్యాఘ్రపాదజహ్నువు: ... ఇంకా చాలలేదోయి. తృప్తిపడలే దన్నమాట.

( తెచ్చియిస్తాడు)

ఋక్షుడు:—సురతో తృప్తిపడినవాడు ఆర్యశబ్దానికి తగడు. భగవతిశిష్యుడు కావడానికి అసలతనికి అధికారమే ఉండదు.

(ఒక యువకుడు పరుగెత్తుకుంటూ ప్రవేశిస్తాడు.)

యువకుడు:—అజీగర్తా! భగవతి... ... ...

ఋక్షుడు:—వ్యాఘ్రపాదా! ఈ సురాపాత్రను దూరంగా పెట్టు. సురను సేవించనని భగవతిదగ్గర నేను శపథం చేశాను.

(వ్యాఘ్రపాదుడు సురాపాత్రను దాచిపెడతాడు. లోపాముద్ర దివోదాసు ఇద్దరూ ప్రవేశిస్తారు. లోపాముద్ర ఆర్యస్త్రీ వేషాన్ని ధరించిఉన్నది. దివోదాసు కొంచెం వృద్ధుడు. వెనకనుండి ఒక భటుడు కత్తిని తీసుకొని ప్రవేశిస్తాడు.)

దివోదాసు:—ఇక్కడ అల్లరి జరిగిందట? ఎవరుదానికి కారకులు?

(అందరూ నమస్కారం చేస్తారు.)

ఋక్షుడు:—(చేతులు జోడించి) రాజన్! తుపాను వచ్చింది. వెళ్ళిపోయింది. మేము ఎంతో ప్రశాంతులంగా ఉన్నాము. భగవతీ! ప్రణామం.

లోపాముద్ర:—(నవ్వి) నీవుగూడా ఇక్కడే ఉన్నావని నాకేమి తెలుసు? నీ వున్నచోట తగాదాజరగడానికి అవకాశమే ఉండదు.

(యువకులందరూ నవ్వుతూ తన్మయంగా భగవతి మాటలు వింటుంటారు.)

ఋక్షుడు:—భగవతీ! (దీర్ఘంగా నిట్టూర్చి) ఆరోజులన్నీ గడచిపోయినవి.

జయంతత్ర్యక్షుడు:— యువరాజుగారు వచ్చి అల్లరి ప్రారంభించినవారిని తీసుకొని పోయినారు.

దివోదాసు:—మంచిపని జరిగింది.

లోపాముద్ర:—(అందరివంకా చూచి) వత్సలారా! తపస్సు సరిగా జరుగుతున్నదా?

అజీగర్తుడు:—తమ అనుగ్రహంవలన బాగానే జరుగుతున్నది.

దివోదాసు:—లోపాముద్రా! అయితే, పద, పోదాం.

(దివోదాసు బయలుదేరుతాడు. ఋక్షుడు తొందరగా భగవతిముందుకు వస్తాడు.)

ఋక్షుడు:—భగవతీ! మాయీ మిత్రులందరూ, నేనూ. అందరమూ మీ దర్శనంవలన కృతార్థులమైనాము.

లోపాముద్ర:—(నవ్వి) అందరూ మైత్రావరుణుని శిష్యులే గదా?

అజీగర్తుడు:—అవును.

ఋక్షుడు:—భగవతీ! నాది ఒక మనవి. వీరందరూ మీకు శిష్యులు కావలెనని కోరుతున్నారు. మీరు ఇక్కడినుండి బయలుదేరినప్పుడు మీవెంట మేముగూడా వస్తాము.

లోపాముద్ర:—వీరందరుగూడానా?

అజీగర్తుడు:—అవును, భగవతీ!

లోపాముద్ర:—నాతోగూడా వస్తారా? తొందరపడుతున్నారు.

జయంతత్రృత్సువు:—కాదు భగవతీ! నేను మీతో వచ్చితీరుతాను. మీరు అంగీకరించకపోతే నదీదేవతకు సమర్పణమవుతాను.

జాబాలితృత్సువు:—నాదిగూడా అదే నిర్ణయం.

వ్యాఘ్రపాదజహ్నువు:—నానిర్ణయంగూడా అంతే.

ఋక్షుడు:—భగవతీ! మీరు సంశయించవలసిన పనిలేదు. దాదాపు ముప్పయిమంది మీతో రావడానికి నిశ్చయించుకొన్నారు. మీరు అంగీకరించకపోతే శరీరాలనే వదలిపెడతారు.

దివోదాసు:—లోపాముద్ర ఆశ్రమం పెద్దదిగాదే !

అజీగర్తుడు:—మేము పెద్దఆశ్రమాన్ని నిర్మాణం చేస్తాము.

జయంతత్సృత్సువు:—నిమిషంలో ఆపని పూర్తిచేస్తాము.

లోపాముద్ర:—మీ బంధువులందరూ ఇక్కడే ఉన్నారు. అగస్త్య శిష్యులు ఇక్కడే వున్నారు. ఈ జనపదమే మీకు తగినది.

అజీగర్తుడు:—కాదు, మా ప్రార్థనను అంగీకరించండి. మేము మీతోబాటు వచ్చితీరుతాము, ఇది మా నిర్ణయం. దీనికి తిరుగులేదు.

జాబాలిత్సృత్సువు:—అంతే.

లోపాముద్ర:—విషయం ఇంతవరకు వచ్చిందని నాకు తెలియలేదు. క్షణికోన్మాదంలోపడి జీవితమంతా దుఃఖిస్తారు. నే నెక్కడకు వెళ్ళినా ఇలాగే జరుగుతున్నది,

ఋక్షుడు:—మీమాట నే నంగీకరించను. క్షణికోన్మాదంలో నేనేమీ పడలేదు. ఉన్మాదం కలుగజేసే స్వభావంగూడా మీది కాదు. మీ దర్శనం చేసిననాటినుండి నేను మహానందం అనుభవిస్తున్నాను. మీతోగూడా ఉన్నప్పుడు ఆ ఆనందం ఇనుమడిస్తున్నది.

లోపాముద్ర:—ఇవన్నీ జ్వరలక్షణాలు. తాపం తగ్గిపోగానే చేతులూ, కాళ్ళూ శక్తివిహీనా లవుతవి.

అజీగర్తుడు:—ఇంకొకరికి శిష్యులమై సుఖం అనుభవించడంలో కంటే మీ శిష్యులమై దుఃఖం అనుభవించడంలోనే ఆనంద మున్నది.

ఋక్షుడు:—భగవతీ! మా నిర్ణయానికి అడ్డులేదు. మీరు ఎప్పుడు బయలుదేరుతున్నారో చెప్పండి.

లోపాముద్ర: (ఎగతాళిగా) సరిగ్గా రేపు సూర్యోదయ సమయంలో బయలుదేరుతాను. నదిలో నావమీద నా ప్రయాణం. తెలిసిందా?

ఋక్షుడు:—మేమే కాదు. ఇంకా చాలామంది బయలుదేరే వారున్నారు, వారి సంగతి ఏమిటి?

లోపాముద్ర:—మీ ఐదుగురికి అధికార మిస్తున్నాను. వచ్చేవారినందరినీ రమ్మని చెప్పండి. చివరకు పశ్చాత్తాప పడతారనికూడా ముందే గట్టిగా చెప్పండి.

(గయుత్పృత్సువు రొప్పుతూ ప్రవేశిస్తాడు)

రాజన్ రాజన్!

దివోదాసు: ఏమిటి? ఏమిజరిగింది?

గయుత్పృత్సువు:—భరతులందరూ రేపు ఉదయం ప్రయాణం కావలెనని విశ్వరథుడు ఆదేశించాడట.

(అందరూ ఉలిక్కి పడతారు.)

దివోదాసు:—(ఉలిక్కిపడి) ఏమిటి?

లోపాముద్ర:—విశ్వరథుడు ఏదో భయంకరమైన పని చేస్తాడని అప్పుడే అనుకున్నాను,

దివోదాసు:—కాని, లోపాముద్రా! ఇది...

లోపాముద్ర:—సూర్యోదయాత్పూర్వమే శాంబరిని సమర్పించవలెనని ఆజ్ఞాపించి అగస్త్యమహర్షి చాలా తొందరపడ్డారు.

దివోదాసు:—విశ్వరథుడు కూడా ఉన్మత్తుడై నాడు. (గయు నితో) వెళ్లి ప్రతర్దనుని పిలుచుకొనిరా.

గయత్పృత్సవు:—రాజా! గురువుగారు తనను కలుసుకోన వలెనని కబురంపినా వినకుండా అతడు వెళ్ళిపోయినాడు.

దివోదాసు:—మైత్రావరుణులు ఎక్కడ ఉన్నారు?

గయత్పృత్సవు:—అగ్నిశాలలో ఉన్నారు.

దివోదాసు:—లోపాముద్రా! ఏలాగైనాసరే, విశ్వరథుడు వెళ్ళిపోకుండా చూడు. మైత్రావరుణులను కలుసుకుని వారికి నచ్చజెప్పు.

లోపాముద్ర:—(నడుస్తూ) మైత్రావరుణులు నా మాటను అంగీకరించరు.

దివోదాసు:—అంగీకరిస్తారు. అంగీకరిస్తారు.

లోపాముద్ర:—సరే ప్రయత్నం చేస్తాను.

(అందరూ వెళ్ళిపోతారు) (తెరపడుతుంది.)

# రెండో దృశ్యం

---

(దివోదాస అతిథిగ్వుని భవనానికి కొంచెం దూరంలో పెద్ద దొడ్డి ఉన్నది. ఆ దొడ్డిలో ఒకమూల అశ్వశాలా, ఇంకొక మూల గోశాలా ఉన్నవి. గోశాలకు దగ్గరగా అజ శాల ఉన్నది. మధ్యలో మూడంతస్థులభవనం ఒకటి ఉన్నది. మొదటిఅంతస్థు రాతికట్టడం. రెండోఅంతస్థు చెక్కలతోనూ, మూడోఅంతస్థు వెదురుకర్రలతోనూ నిర్మించబడ్డవి. భవనానికి రెండువైపులా వసారా లున్నవి.

భవనానికి వెనకవైపున వేరువేరుగా పర్ణకుటీరా లున్నవి. ఆ కుటీరాలకు వెనకవైపున సరస్వతీ నదీతీరంవరకు వ్యాపించిన ఉద్యానవన మున్నది. ఆ ఉద్యానవనంలో చిన్న అతిథిగృహం ఒకటి ఉన్నది. లోపాముద్ర ఆ అతిథి గృహంలో నివసిస్తున్నది.

భవనంలోని అగ్నిశాలలో ఒకవైపున మైత్రావరుణులు కూర్చొని ఉన్నారు. వైదికమంత్రాలు చదివి అర్ఘ్యం వదలుతున్నారు.)

అగస్త్యుడు:—ఎవరక్కడ ?

(రోహిణి అగస్త్యుని కుమార్తె ప్రవేశిస్తుంది. ఆమెకు ఇరవై సంవత్సరాల వయస్సు ఉంటుంది. ఆమె ముఖముద్ర గంభీరంగా ఉన్నది.)

రోహిణి: — ఎవరూ లేరు, నేనే.

అగస్త్యుడు:—నీవు ఎక్కడినుండి వచ్చావు ?

రోహిణి:—అంతఃపురాన్నుండి ఆశ్రమానికి వెళ్ళుతున్నాను.

అగస్త్యుడు:—గౌతము డెక్కడ ?

రోహిణి:—పనిమీద పంపించాను.

అగస్త్యుడు:—ప్రతర్దనుడు వచ్చాడా ?

రోహిణి: — (నెమ్మదిగా) రానన్నాడు.

అగస్త్యుడు:—అతిథిగృ హెక్కడ ?

రోహిణి:—లోపాముద్ర ప్రయాణానికి తగిన సన్నాహాలు చేస్తున్నాడు.

అగస్త్యుడు:—ఆమె ప్రయాణ మెప్పుడు ?

రోహిణి:—రేపు ఉదయం.

అగస్త్యుడు:—అయితే నా సంరక్షణార్థం నీవు ఉంటావా ?

రోహిణి:—నాన్నగారూ ! మీరు చాలా అలసిపోయినారు. పదండి ఆశ్రమానికి పోదాం.

అగస్త్యుడు:—అమ్మా ! దేవతలు విశ్రాంతి తీసుకొనడానికి నాకు ఇంకా అనుజ్ఞనివ్వలేదు, ప్రతర్దనుడు ఏమన్నాడు ?

రోహిణి:—భరతులందరూ ప్రయాణసన్నాహంలో ఉన్నారు.

అగస్త్యుడు:—(కోపంగా) ఏమిటి ?

రోహిణి:—విశ్వరథుడు ఆజ్ఞాపించినాడట.

అగస్త్యుడు:—(ముఖంమీద ముడతలుపడుతవి. కళ్ళు చీకట్లు

కమ్మినట్లవుతుంది) (కొంచెంసేపుఆగి) రోహిణీ! నీవు వెళ్ళు.

రోహిణి:—(ప్రేమగా) తండ్రీ!

అగస్త్యుడు:—రోహిణీ! నీవు వెళ్లు.

రోహిణి:—విశ్వరథుని ప్రయాణాన్ని ఆపివేయాలి.

అగస్త్యుడు:—అతడు వెళ్ళిపోతే సప్తసింధు అంతటా దావానలం అలముకొంటుంది.

రోహిణి:—తప్పక వెళ్లిపోయేటట్లే ఉన్నాడు,

అగస్త్యుడు:—(ఉద్రిక్తుడవుతాడు) విశ్వరథుడు వెళ్ళిపోతే - వెళ్ళిపోతే... ...నా ప్రయత్నమంతా వ్యర్థమై పోతుంది. (ఒక నిర్ణయాన్ని చెప్పుతున్నట్లుగా) అగస్త్యుడు జీవించడు.

రోహిణి:—(భయపడి) నాన్నగారూ! ఏమిటి ఆ మాటలు?

అగస్త్యుడు:—(రోహిణి తల నిమురుతూ) ఆర్యులనందరినీ ఏకం చేయడానికే నేను జీవిస్తున్నాను. ఆపనికి విఘాతం కలిగినప్పుడు నేను జీవించి ప్రయోజన మేముంటుంది?

రోహిణి:—పితాజీ!

అగస్త్యుడు:—రోహిణీ! వెళ్లు. ఇది నా ప్రతిజ్ఞ.

రోహిణి:—(కన్నీరు కారుస్తూ) విశ్వరథునితో ఒక్కసారి మాట్లాడి చూడండి. అన్ని విషయాలూ తెలియజెప్పండి.

అగస్త్యుడు:—నిన్న నేను చివరి ప్రయత్నం చేశాను చివరి ఆజ్ఞనుగూడా ఇచ్చాను. నా ఆజ్ఞను మన్నించకపోతే

ఆతని పౌరోహిత్యపుపదవి నా కక్కర్లేదు. నేను బ్రతికి ఉండవలసిన అవసరంగూడా లేదు.

రోహిణి:—(నిరాశురాలై) మీ రిద్దరూ మొండిపట్టుగానే ఉన్నారు.

అగస్త్యుడు:—వరుణాజ్ఞను ఉల్లంఘించడమెలా ? (మాట మార్చి) నీవు వెళ్లు.

రోహిణి:—ఇక్కడ మీరు ఎంతసేపు ఉంటారు ?

అగస్త్యుడు:—చాలాసేపు ఉంటాను.

రోహిణి:—అయితే నేను వచ్చినదాకా ఉండండి. ఇద్దరమూ కలసి ఆశ్రమానికి వెళ్లుదాము.

(నిష్క్రమిస్తుంది)

(అగస్త్యుడు కొంతసేపు ఆకాశంవంక చూస్తాడు. రెండుచేతులతో కళ్ళు మూసుకొంటాడు. లోపాముద్ర ప్రవేశిస్తుంది. ఆమె శరీర కాంతి నలువైపులా ప్రసరిస్తుంటుంది. హఠాత్తుగా అగస్త్యుడు ఆమెవంక చూచి)

అగస్త్యుడు:— భారద్వాజీ ! దయచేయి. ఎందుకువచ్చావు ?

లోపాముద్ర:— మహర్షివర్యా ! సెలవు తీసుకోనడానికి వచ్చాను. రేపు ఉదయం నాఆశ్రమానికి వెళ్ళుతున్నాను.

అగస్త్యుడు:—సరే.

లోపాముద్ర:—(ఎగతాళిగా) నేను ఇక్కడ ఉన్నా. లేక పోయినా తమబోటి మహాత్ముల కేమిలెండి ?

అగస్త్యుడు:—నాపమీదనా ప్రయాణం ?

లోపాముద్ర.—అవును (నవ్వి) ఒక్కవిషయం అడగ మన్నారా? (అగస్త్యుడు సరేనన్నట్లు తలవూపుతాడు.) మీరు విశ్వరథుని కిచ్చిన ఆదేశాన్ని ఉపసంహరించు కొంటే!

అగస్త్యుడు:—(కటువుగా) విశ్వరథుడు నీకు ఇష్టుడుగనుకనా?

లోపాముద్ర:—విశ్వరథుడు మన కిద్దరికీ ఇష్టుడే. కోపాన్ని దిగమింగండి. అతణ్ణి క్షమించండి.

అగస్త్యుడు:—ఈ తగాదాకు మూలకారణం ఆ శాంబరి. ఆమెను వదలిపెట్టమని విశ్వరథునితో చెప్పు.

లోపాముద్ర:—(ఎగతాళిగా) అన్ని తగాదాలకు స్త్రీయే కారణమవుతూఉంటుంది, ఎందువల్లనో?

అగస్త్యుడు:—అది నీకే తెలియాలి. నీవుమాత్రం తగాదాకు కారణంగాదా?

లోపాముద్ర:—మహర్షీ! నేను తగాదాకు ఏమాత్రమూ కారణంకాను. నేను ఎవరి హృదయానికీ అధిదేవతగా లేను, మరుత్తులవలె ఇష్టంవచ్చినట్లు విహారం చేస్తుంటాను.

అగస్త్యుడు:—శాంబరి... ... ...

లోపాముద్ర:—పాపం, ఆ అమ్మాయి దేమున్నది?

అగస్త్యుడు:— ఆమె యుద్ధంలో జయించబడిన గోవుతో సమానం. ఎక్కడకుపంపితే అక్కడకే వెళ్ళుతుంది.

లోపాముద్ర:—మైత్రావరుణ మహర్షీ! విశ్వరథునికొరకై శాంబరి తన తండ్రిని చంపుకొన్నది.

అగస్త్యుడు:—శాంబరిని వదలనిది విశ్వరథునికి శాంతి లేదు.

లోపాముద్ర:—స్త్రీ తన భర్తను వదలివేస్తుందా ?

అగస్త్యుడు:—(కోపంగా) భరతశ్రేష్ఠుడు దాసీకన్యను రాణిగా స్వీకరిస్తాడా ?

లోపాముద్ర:—దాసీకన్య లెవరిదగ్గర లేరు ?

అగస్త్యుడు:—(కఠోరంగా) భారద్వాజీ ! ఆర్యులపత్ని ఆర్య అవుతుంది. ఆమె సంతానమే దేవతలకు అర్ఘ్యమిచ్చే అర్హత కలిగి ఉంటుంది.

లోపాముద్ర:—మైత్రావరుణా ! ఆర్యులను నేను ఎరుగని దానను కాను. విశ్వరథునిలాంటి పత్నీపరాయణు లేరి ?

అగస్త్యుడు:—ఆర్యుల ఆదర్శాలు ఎలాఉండవలెనని నే నను కొంటున్నానో నీకు తెలియదు. భరతులు దాసిని రాజ మహిషిగా అంగీకరించరు.

లోపాముద్ర:—అనేకమంది ఆర్యస్త్రీలకంటే శాంబరి ఎంతో పవిత్రురాలు. స్నేహపరాయణ.

అగస్త్యుడు:—లోపాముద్రా ! కౌశికుడు నా పుత్రుడు. అతడు చక్రవర్తి కావలెనని నేను ఆశిస్తున్నాను. అతని పౌరోహిత్యాన్ని స్వీకరించడానికి నేను ఇంద్రుని అనుమతిని కూడా తీసుకొన్నాను. ఆర్యత్వానునే పదవినుండి అతనిని పతితుణ్ణి కానీయను. విన్నావా ?

లోపాముద్ర:—మహర్షీ ! గురువుగారి మాటకై ప్రాణా లర్పించేవారిలో విశ్వరథుడు ముందుంటాడు. అతనికి

ప్రాణదానంచేసిన శాంబరిని హింసించబూనడం దేవతలకు సమ్మతంకాదని నా అభిప్రాయం.

అగస్త్యుడు:—ఆర్యులనుచూచి ద్వేషించేవారిచేతిలో ఆర్యత్వం కళంకితమవుతూ వుంటే చూచి నేను సహించను,

లోపాముద్ర. — అదేమిటి ? మంత్రబలంవలన నేను శంబరుని వశంచేసుకొన్నాను. మిమ్మల్ని ప్రేరేపించే ఇంద్రుడు దస్యులకు ప్రేరణను కలుగజేయడా ? ఆర్యులను ఉద్ధరించే వరుణ దేవుడు దస్యులను ఉద్ధరించడా ? దేవతల శక్తికి హద్దులు ఏర్పాటుచేసేవారెవరు ?

అగస్త్యుడు:—అయితే విశ్వరథుడు గురువుఆజ్ఞను ఉల్లంఘించవలసిందేనా ?

లోపాముద్ర:—అవిధేయతగా మాట్లాడినందుకు క్షమించండి. గురువు ఆజ్ఞకంటే వరుణదేవుని ఆజ్ఞ గొప్పదిగాదా ?

అగస్త్యుడు:—విశ్వరథుని ఎవరు ప్రోత్సహిస్తున్నారో నాకు తెలుసును,

లోపాముద్ర:—మైత్రావరుణా ! విశ్వరథుడు ఆవాహనచేస్తే దేవతలు దర్శనమిస్తూనే ఉన్నారు. అతడు విప్రుడు కావడానికి జన్మించాడు. అతనిని ఎవ్వరూ ప్రోత్సహించనక్కరలేదు.

అగస్త్యుడు:—మీరంతా విశ్వరథుని చెడగొడుతున్నారు.

లోపాముద్ర:—విశ్వరథుని బుద్ధి వికసిస్తున్నది. చివరకు విశ్వరథుడు మన ఇద్దరికీర్తినీ ఇనుమడింపజేస్తాడు.

అగస్త్యుడు:—మన ఇద్దరి కీర్తినా ?

లోపాముద్ర:—అతని ఆలోచనలకూ, అతని కీర్తిప్రకాశానికీ తల్లిదండ్రులము మన మిద్దరమే.

అగస్త్యుడు:—(పెదవులు కొరుక్కుంటాడు) బాగాఉన్నది. ఈ కళంకంగూడానా? (వెళ్ళిపోబోతాడు. లోపాముద్ర ఒక్కఅడుగు ముందుకువచ్చి అగస్త్యునిఅడ్డగిస్తుంది.)

లోపాముద్ర:—మహార్షివర్యా! ఒక్కమాటకు జవాబు చెప్పి వెళ్ళిపొండి.

అగస్త్యుడు:—ఏమిటి ఆమాట?

లోపాముద్ర:—నేను ఏమిపాపం చేశాను? నాతో మాట్లాడ డానికి అలా కంగారుపడతారేమిటి?

అగస్త్యుడు:—భారద్వాజీ! లోకమంతా నీతో మాట్లాడ డానికి ఆతురత చెందుతున్నదిగదా, అది చాలదా?

లోపాముద్ర:—(నవ్వి) నిజమే. కాని ఎవరితోనేను మాట్లాడ వలెనని అనుకొంటున్నానో ఆ వ్యక్తి నాతో మాట్లాడడం లేదు. మీకు నచ్చని విషయం నాలో ఏమున్నదో కొంచెం సెలవివ్వండి.

అగస్త్యుడు:—నీవంటేనే నాకు భయం కలుగుతున్నది.

లోపాముద్ర:—(కళ్ళు విప్పారజేసి) హృదయాన్ని పోగొట్టు కొంటానని భయమా?

అగస్త్యుడు:—కాదు. నిన్ను నిరాశపరచవలసి వస్తుందేమోనని

లోపాముద్ర:—మైత్రావరుణమహార్షీ! నిజానికి భయం నాకు కలుగుతున్నది. నేను ఎక్కడకుపోయినా పురుషులందరూ

నాకు తమ హృదయాలను సమర్పించారు. మూల్యం ఇవ్వకుండానే వారి హృదయాలను స్వీకరించాను. కాని ఈనాడు మూల్యం ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నాను. కాని మీరు హృదయ మివ్వడం లేదు. ఎంత నిర్దయ!

అగస్త్యుడు:—ఏమిటి నీమాటలు!!

లోపాముద్ర:—సఖులతో మాట్లాడేవి ఇవేమాటలు.

అగస్త్యుడు:—నీకు నేను సఖుడనా?

లోపాముద్ర:—అవును. దేవుడే సఖులను సృజిస్తాడు. నేను నా వ్రతాన్ని వదలిపెట్టివేశాను.

అగస్త్యుడు:—నీ ప్రియత్నాలన్నీ నిష్ఫలమయ్యేవేనని మళ్ళీ చెప్పమన్నావా?

లోపాముద్ర:—గడచిన రెండు నెలలనుండి చూస్తున్నాను. విజయం నాదే. (నవ్వుతుంది) సమయం ఇంకా రాలేదు. నేను నా ఆశ్రమానికి వెళ్ళిపోతాను. వరుణదేవుడు మీ తపస్సును సంపొందించి మీ హృదయాన్ని ప్రేమభావంతో నింపుగాక.

(నవ్వుతూ వెళ్ళిపోతుంది)

అగస్త్యుడు:—(పిచ్చివానిలాగా అటూ ఇటూ తిరుగుతాడు) మర్యాద హీనురాలు!

(తెర పడుతుంది)

---

# మూడో దృశ్యం

(విశ్వరథుని భవనంలోని అగ్నిశాలలో విశాలమైన వేదిక ఉన్నది. ప్రతర్దనుడూ జమదగ్నీ మాట్లాడుతూ ఉంటారు. జమదగ్ని మృగచర్మం ధరించి ఉన్నాడు. ఇద్దరూ విచారంగా ఉన్నారు)

ప్రతర్దనుడు:—జమదగ్నీ! మనం పొరపాటు పడుతున్నాము. మనమే పొరపాటుపడుతున్నాము.

జమదగ్ని:—కాని ఇంతవరకూ నీవు దృఢంగానే ఉన్నావు?

ప్రతర్దనుడు:—నాకు యుద్ధం చేయడమే తెలుసును, కాని ఈ రాజ్యతంత్రాలు తెలియవు. భరతశ్రేష్ఠుడు ఇక్కడినుండి వెళ్ళిపోదామని సెలవిచ్చినప్పుడు ఒక్క విషయమే ఆలోచించాను.

జమదగ్ని:—ఏమిటి ఆ విషయం?

ప్రతర్దనుడు:—భరతులకు అవమానం జరుగుతున్న దనుకొన్నాను. కేవలం అవమానం వరకే ఇది సీమితమైతే వెనకకు తిరిగి చూచేవాణ్ణే కాను. కాని వ్యవహారం ముదిరింది. మనం తృత్సుగ్రామం వదలగానే అగస్త్యమహర్షి పౌరోహిత్యపదవిని వదలేస్తారట.

జమదగ్ని:—అవును.

ప్రతర్దనుడు:—తృత్సువులతో మనకు యుద్ధం జరుగుతుంది. యుద్ధానికి భయపడకపోయినా భరతుల భవిష్యత్తు ఏమవుతుంది ? భరతశ్రేష్ఠుడు శాంబరిని రాజమహిషినిగా చేయవలెనని కోరుతున్నాడు. అది భరతులు సహించరు. వ్యవహారాన్ని ఇంతవరకు రానిస్తారని నేననుకోలేదు.

జమదగ్ని:—కర్దముని అభిప్రాయం ఏమిటి ?

ప్రతర్దనుడు:—కర్దముడు ఇక్కడకే వస్తాడు. అతడు మరీ ఉత్తేజితుడై ఉన్నాడు. (చెవిలో) శంబరుని దౌహిత్రుడు భరతరాజు కావడం ఎవ్వరికీ ఇష్టంలేదు. భరతులు తమలోతాము కలహిస్తారని నా అనుమానం.

జమదగ్ని:—అలాగా ?

ప్రతర్దనుడు:—అవును, భరతశ్రేష్ఠుడెలా ఉన్నాడు ?

జమదగ్ని:—నేటికి నాలుగురోజులనుండి ఏదో దేవతారాధన చేస్తూ ఉన్నట్లుగా వొంటరిగా ఉంటున్నాడు. క్షణకాలమైనా కన్నుమూయడంలేదు. అప్పుడప్పుడు శాంబరి దగ్గరకు మాత్రంపోతున్నాడు.

ప్రతర్దనుడు:—శంబరరాజపుత్రి ఎలా ఉన్నది?

జమదగ్ని:—ప్రతర్దనా ! ఆమెకు విశ్వరథుని ధ్యాసతప్ప ఇంకొక ధ్యాస లేనేలేదు. ఆమె కళ్ళలోనుండి ఆమె ప్రాణాలు ప్రవహిస్తున్నవేమోనని అనిపిస్తున్నది.

ప్రతర్దనుడు:—దౌర్భాగ్యురాలు ! !

జమదగ్ని:—ఆర్యరమణి అయితే బాగుండేది.

(బయటనుండి కర్దముడు)

సేనాధిపతీ ! నేను రావచ్చునా ?

(కర్దముడు వృద్ధుడు. దగ్గుతూ ప్రవేశిస్తాడు.) చేతిలో కర్రఉంటుంది.

ప్రతర్దనుడు:—మఘవన్ ! దయచేయండి. ఆయాసం ఇంకా తగ్గలేదే !

కర్దముడు:—యమసదనానికి చేరితేనే ఈఆయాసం తగ్గుతుంది. భార్గవా! నమస్కారం. (జమదగ్నికి నమస్కారం చేస్తాడు)

జమదగ్ని:— వందసంవత్సరాలు జీవించు. కూరోచ్చో. కర్దమా ! (కర్దముడు కూర్చుంటాడు. అతనితో ఇద్దరు భరతులు లోపలకు ప్రవేశిస్తారు. వారు గూడా కూర్చుంటారు.)

కర్దముడు:—కౌశికు డెక్కడ ?

జమదగ్ని:—ఇప్పుడే వస్తాడు.

కర్దముడు:—భార్గవా ! నేను వృద్ధుణ్ణి. భరతులు దస్యుకన్యను రాజమహిషిగా అంగీకరించడం అసంభవం.

ప్రతిర్దనుడు:—అయితే శతృవులతో యుద్ధమెందుకు ?

కర్దముడు:—మీరు ఎంతైనా యుద్ధంచేయండి. జాతినిమాత్రం కళంకితంచేయబోకండి. (దగ్గుతూ) శంబరకన్యను స్వీకరించి జాతిని కళంకితం చేయుడం మంచిదికాదు.

ప్రశిర్దనుడు:—గురుదేవుని మాటయే సత్యంగా కనపడుతున్నది.

కర్దముడు:—సోదరుడా! ఆ గురుదేవుని కటాక్షంవల్లనేగదా, భరతులు ఇంత కీర్తివంతులైనారు?

జమదగ్ని:—ఈ విషయాలన్నీ నిన్న గురువుగారు విశ్వరథునికి బోధించారు. తృత్సులమీదనున్నా ద్వేషంచేత రెండు ప్రస్తుతం భరతులు విశ్వరథుని పక్షంలోనేఉన్నా చివరకు విశ్వరథునీ, శాంబరినీ, క్షమించరనీ, పదభ్రష్టులను చేస్తారనీగూడా గురువుగారు చెప్పిచూచారు. ప్రతర్దనుని ప్రసక్తిగూడా తీసుకొని వచ్చారు.

ప్రతర్దనుడు:—నా ప్రసక్తినా? (నవ్వి) గురుదేవులకు పిచ్చి ఎత్తినది.

జమదగ్ని:—విశ్వరథుడు నీవన్నమాటనే అన్నాడు.

ప్రతర్దనుడు:—తరువాత?

జమదగ్ని:—ప్రతర్దనుడు శత్రువులమధ్యన ఉన్నాడు, కనుక నీ పక్షంలో ఉన్నాడు. భరతగ్రామం చేరుకొన్న తరువాత తనభార్యనూ, తన తల్లినీ కలుసుకొన్నాడంటే అతడు నీమాట వినడు. భరతజాతి ఆజ్ఞను శిరసావహిస్తాడు, అని అన్నారు. గురుదేవులు.

ప్రతర్దనుడు:—అదీ నిజమే. మా అమ్మ సుతరామూ అంగీకరించదు.

కర్దముడు:—అందుకు కౌశికుడేమన్నాడు?

జమదగ్ని:—"శాంబరిని పత్నిగా స్వీకరించడానికి దేవతలు అంగీకరించారు" అన్నాడు. ఎప్పుడు మాట్లాడినా అతనిది అదేమాట.

ప్రతర్దనుడు:—ఈ దేవతలుగూడా బలేవారు!! ఎప్పుడు ఎలాతోస్తే అలా అంగీకరిస్తుంటారు.

జమదగ్ని:—దేవతల విషయంలో అలా మాట్లాడకు, తప్పు.

ప్రతర్దనుడు:—అయితే ఇప్పుడు మనం ఏమిచేయాలి ?

కర్దముడు:—శాంబరిని వదలిపెట్టడం తప్ప నాకింకొక ఉపాయం ఏమీ తోచడంలేదు.

ప్రతర్దనుడు:—మహాఅథర్వణులు ఉంటే బాగాఉండేది, ఈ సమస్యను పరిష్కరించ కలిగేవారు.

జమదగ్ని:—గురుశిష్యు లిద్దరూ ఇలా కలహిస్తారని నేననుకోలేదు.

ప్రతర్దనుడు:—ఏదిఏట్లయినా తృత్సువుల అత్యాచారాలను సహించడం కష్టం.

కర్దముడు:—ఆమాట నిజమే, కాని ఇక్కడ మూడోసంగతి జరగబోతున్నదిగదా !

(దగ్గుతాడు. తెరలోనుండి పదధ్వని వినపడుతుంది.)

జమదగ్ని:—ష్...ష్...ష్... విశ్వరథుడు వస్తున్నాడు.

(విశ్వరథుడు ప్రవేశిస్తాడు. ముఖం చింతాక్రాంతంగా ఉంటుంది. ఉదాసీనంగా కనపడుతుంటాడు. అతనిమనస్సు తుపానులో చిక్కుకున్న నావలాగా ఉంటుంది. అగ్నివైపు చూస్తూ అలాగే ఉండిపోతాడు. జమదగ్ని, ప్రతర్దన, కర్దములు లేచి నమస్కారం చేస్తారు.)

ప్రతర్దనుడు:—భరతశ్రేష్ఠా ! కర్దమమఘవన్ దయచేశాడు.

కర్దముడు:—(దగ్గరకు వచ్చి) కౌశికశ్రేష్ఠా! రాజన్! దర్శనం చేసుకొనిపోదామని వచ్చాను.

విశ్వరథుడు:—అంటే నాకు హితబోధచేయడానికి వచ్చారన్నమాట.

కర్దముడు:—కాదు, కాదు. ఊరికనే వచ్చాను.

విశ్వరథుడు:—(స్నేహపూర్వకంగా) ఏమిటి సెలవు?

(అందరూ కూర్చుంటారు)

కర్దముడు:—రేపు ప్రయాణమేకదా?

విశ్వరథుడు:—ఏమన్నారు? (స్మృతిలో ఉన్నట్లు మాట్లాడడు) ప్రయాణమా? అవును.

కర్దముడు:—(దగ్గి) గురువుగారికి ఇష్టంలేదు.

విశ్వరథుడు:—ఆ! ఏమిటి? గురువుగారా!! కర్దమా! నాకు ఎంతగా హితబోధచేసినా ప్రయోజనం లేదు. మైత్రావరుణులే నా మనస్సును మార్చలేకపోయినారు. మఘవన్! నన్ను క్షమించండి. నామీద దయ చూపించండి. నా కంతేచాలు. నేను అంతా విన్నాను. కాని దైవాజ్ఞను నేను ఉల్లఘించలేను.

(స్మృతిలో ఉండడు, ఋషుడు ప్రవేశిస్తాడు)

ఋషుడు:—మునిశ్రేష్ఠులు వశిష్ఠమహర్షి దయచేస్తున్నారు. అదుగో రానేవచ్చారు.

విశ్వరథుడు:—(ఉలిక్కిపడి) ఓహో!

(అందరూ లేచినిలబడతారు. విశ్వరథుడు వశిష్ఠుని అభ్యుత్థానంచేసి తీసుకొనివస్తాడు. వశిష్ఠుడు శుద్ధ సత్వమూర్తి, మహాజ్ఞాని)

వశిష్ఠుడు:—(నవ్వి) విశ్వరథా!

విశ్వరథుడు:—మునివర్యా! నమస్కారం (పాదములకు నమస్కారం చేస్తాడు)

జమదగ్ని:—మహర్షీ! నేనుకూడా ... ... ... (నమస్కారం చేస్తాడు.)

వశిష్ఠుడు:—వత్సలారా! శతంజీవులుకండు.

(అందరూ కూర్చుంటారు.)

విశ్వరథుడు:—మునిశ్రేష్ఠా! తాముదయచేశారు. కృతార్థుణ్ణి. ఏమిటి ఆజ్ఞ?

వశిష్ఠుడు:—విశ్వరథా! నీతో కొన్ని విషయాలు మనస్సువిప్పి మాట్లాడడానికి వచ్చాను. నీమనస్సులోఉన్న అసలు విషయమేమిటో స్పష్టంగా చెప్పాలి.

విశ్వరథుడు:— (విచారపూర్వకంగా) తప్పక చెప్పుతాను. వీరంతా మనవారే. మాట్లాడండి.

వశిష్ఠుడు: — నీవు ఏమిచేయబోతున్నావో, ఆలోచించుకొన్నావా?

విశ్వరథుడు:—(పైకిచూస్తూ నెమ్మదిగా) ఆలోచించాను.

వశిష్ఠుడు:—అగస్త్యభగవానుడు నిన్ను వదలి వెళ్ళిపోతాడు.

విశ్వరథుడు:—అందుకని దైవాజ్ఞను ఉల్లంఘించనా?

వశిష్ఠుడు:—శత్రుత్సువులతో వైరం కలుగుతుంది.

విశ్వరథుడు:—అదికూడా భయకారణమే నంటారా?

వశిష్ఠుడు:—ఘోషామాత ప్రాణాలను వదులుతుంది.

విశ్వరథుడు:—(గట్టిగా) దైవాజ్ఞను ఉల్లంఘించలేను.

వశిష్ఠుడు:—భరతులు (ప్రతర్దనునిచూచి ఆగిపోతాడు.)

విశ్వరథుడు:—(కళ్లు ప్రకాశించడం ఆరంబిస్తవి) నన్ను పదభ్రష్టుణ్ణి చేస్తారు, చంపివేస్తారు. మునిశ్రేష్ఠా! నాకు రాజ్యకాంక్ష లేదు. ప్రాణాలమీద మోహం లేదు.

వశిష్ఠుడు:—(నవ్వి) అయితే నీలో మోహం ఉన్నది. ఆ దస్యుకన్యకమీదనేనా? దేవతలు ఎప్పుడూ నీ కలాంటి ఆజ్ఞ నివ్వరు.

విశ్వరథుడు:—(కంపించిపోయిన స్వరంతో) నిజం? నిజం. దేవతలు ఇలాంటి ఆజ్ఞనిస్తారు, ప్రతిఘుడేయగా. ప్రతిక్షణం—

వశిష్ఠుడు:—ఏమిటి?

విశ్వరథుడు:—శాంబరిని నేను స్వీకరించాను. ఆమె నాపత్ని, నా ధర్మపత్ని, నా సహధర్మచారిణి.

వశిష్ఠుడు:—ఇది దేవతల ప్రేరణకాదు. (నవ్వి) ఎవరి ప్రేరణో నాకు తెలుసును,

విశ్వరథుడు:—భగవతి లోపాముద్ర నాకు పూజ్యురాలు. ఇది ఆమె ప్రేరణకావచ్చును. అయినా అందులోనే నాకు దైవవాణి వినపడుతున్నది.

వశిష్ఠుడు:—శాంబరి ఆర్యరమణికాదు.

విశ్వరథుడు:—కాదా ? ఎందువల్ల వశిష్ఠమహర్షీ ? దస్యు కన్యను దాసినిగా స్వీకరించవచ్చునా ? ఉంపుడుకత్తెనుగా ఉంచుకోవచ్చునా ? భార్యనుగా స్వీకరించగూడదన్న మాట. ఆమెలో ఉన్న ప్రేమ, పవిత్రత ఏ ఆర్యస్త్రీలో ఉన్నదో ఆలోచించండి. ఆమె నాకొరకై తన తండ్రిని గూడా చంపుకొన్నది.

వశిష్ఠుడు:—వత్సా ! ఇవన్నీ చిన్నతనపు మాటలు. ఇందులో దైవాజ్ఞ అంటూ ఏమీ లేదు. ఈమెవలన నీకు కలిగే సంతానము నల్లగా, కురూపంగా తయారవుతుంది. ఆ సంతానానికి నీవు మహాథర్వణుల, అగస్త్యుల విద్యను నేర్పుతావా ? వారిని కుశికుని సింహాసంమీద అధిష్ఠింప జేస్తావా ?

విశ్వరథుడు:—(పూజ్యభావంతో) మునిశ్రేష్ఠా ! నేను రాత్రింబగళ్ళు దేవతల ప్రేరణకొరకై ప్రార్థన చేస్తున్నాను. మీ మాటలు నాకు అర్థం కావడంలేదు. ఎంతమంది కురూపంగలిగిన ఆర్యస్త్రీలు మన పల్లెలలో లేరు ! శాంబరి ఎందువల్ల ఆర్యస్త్రీ కాగూడదు ?

వశిష్ఠుడు:—ఆర్యులు జన్మిస్తారు. అంతేకాని రూపొందరు.

విశ్వరథుడు:—కాదు, అది సరికాదు. నాకు వినిపిస్తున్న దైవవాణి వేరుగా ఉన్నది. నాలో ఆర్యత్వముంటే ఇంకొకరిని ఎందుకు మార్చలేను ? అలా మార్చలేకపోతే నా తపస్సులో ఏదో లోటు ఉన్నదన్నమాట.

వశిష్ఠుడు:—నీవింత ఉన్మత్తుడవైనావని నాకు తెలియలేదు. అనార్యులు ఆర్యులవుతారా ?

విశ్వరథుడు:—అనార్యులు ఆర్యులుకాకపోతే మహాఅథర్వ ణుల, మైత్రావరుణుల విద్య నిరర్థకం. మీ తపస్సూ, మీ పవిత్రతా ఎందుకూ కొరగావన్నమాట. మహర్షి ! (వ్యాకులంగా) ఎవ్వరూ నన్ను అర్థంచేసుకోవడంలేదు. వరుణదేవా ! (ఆకాశంవంక చూస్తూ నిలబడతాడు.)

వశిష్ఠుడు:—(లేచి) నీవు మా మాటల్ని అంగీకరించవా ? సరే, మంచిది. అనంతకాలంవరకూ ఆర్యవిధ్వంసకుడవనే ప్రతీతిని పొందుతావు. పితృదేవతలుగూడా నిన్ను స్వీక రించరు.

(అందరూ లేచి నిలబడతారు.)

విశ్వరథుడు:— (తలక్రిందకువాల్చి) దైవేచ్ఛ ఎలా ఉంటే అలా జరుగుతుంది. మునివర్యా ! నేను దేవతల ఆధీనంలో ఉన్నాను. నేను అవలంబిస్తున్న విధానంలోనే ఆర్యత్వానికి వికాసం ఉన్నదేమో ! ! (వశిష్ఠుని పాదములకు నమస్క రిస్తాడు.)

వశిష్ఠుడు:—మంచిది, వత్సా ! వరుణదేవుడు నీకు సద్బుద్ధిని ప్రసాదించుగాత.

(వశిష్ఠుడు వెళ్ళిపోతాడు.)

విశ్వరథుడు:—కర్దమ ప్రతర్దనులారా ! నన్ను క్షమించండి. (నిశ్చయంగా) కుశిక సింహాసనాన్ని మీ ఇష్టంవచ్చినవారికి సమర్పించండి. శాంబరిలేకుండా ఒంటరిగా నేనా సింహా

నన్నాన్ని అధిరోహించదలచుకోలేను. నన్ను వదలి మీరందరూ వెళ్ళిపోయినాసరే, (అంటూ లోపలికి వెళ్ళుతాడు.

(కర్దముడు వెళ్ళిపోతాడు)

ప్రతర్దనుడు:—భార్గవా ! మన కర్తవ్యమేమిటి ?

జమదగ్ని:—ఏమి జరుగుతుందో చూస్తూ ఉండడమే.

(రోహిణి ప్రవేశిస్తుంది.)

రోహిణి:—భార్గవా ! కౌశికు డెక్కడ ?

ప్రతర్దనుడు:—దయచేయండి.

జమదగ్ని:—రోహిణీ ! నీ వెక్కడనుండి వస్తున్నావు ? గురుదేవులు సందేశ మేమైనా పంపించారా ?

రోహిణి:—లేదు. కౌశికునితో మాట్లాడవలసిన పని ఉన్నది.

జమదగ్ని:—ఒంటరిగానా?

రోహిణి:—అవును.

జమదగ్ని:—కూరో్చ. పంపుతాను.

ప్రతర్దనుడు:—భార్గవా! నాకు సెలవిప్పించండి. ప్రయాణ సన్నాహం చేయాలి.

(జమదగ్ని ప్రతర్దనులు వెళ్ళిపోతారు.)

(విశ్వరథుడు ప్రవేశిస్తాడు.)

విశ్వరథుడు:—రోహిణీ! నీవా? (వచ్చి కూర్చుంటాడు.)

రోహిణి:—(నెమ్మదిగా) కౌశికా! కౌశికా! (కన్నీరు కారుస్తూ)

నామీద కోపమా? నాతోగూడా మాట్లాడవా? (పై ఉత్త రీయంతో కళ్లు తుడుచుకొంటుంది.)

విశ్వరథుడు:—రోహిణీ! ఆ కన్నీళ్లేమిటి? ఛీ! ఛీ!

(విశ్వరథుని కంటివెంట కన్నీరు కారుతుంది.)

రోహిణి:—విశ్వరథా! నీవుకూడా కన్నీరు కారుస్తున్నావా?

విశ్వరథుడు:—రోహిణీ! ఇన్నిరోజులూ నీవు నన్ను కలుసుకో నైనా లేదు.

రోహిణి:—(కన్నీరు తుడుచుకొని) నీవు కోపంలో ఉండడం వలన నీ దగ్గరకు రావడానికి సాహసించలేకపోయినాను.

విశ్వరథుడు:—కోపంలో ఉన్నానా? ఎవరన్నారు?

రోహిణి:—ప్రపంచమంతా అంటున్నది.

విశ్వరథుడు:— ఆ మాటను నీవు విశ్వసించావన్నమాట. రోహిణీ! (రోహిణివంక ఎగాదిగా చూసి) నీ ఆరోగ్యం బాగాఉన్నట్లు లేదే ? చూడు... ...మరి... ...(ఏదో జ్ఞాపకం తెచ్చుకొని) నీ వివాహంవిషయం... ...సుదా సుతో... ...నేను ఏమివిన్నాను ? సరిగా జ్ఞాపకం లేదు. (దీర్ఘంగానిట్టూర్చి) నా తలతిరిగిపోతున్నది... ...అందరూ ... ...నన్ను మరచిపోతున్నారు.

రోహిణి:—కౌశికా! సుదాసుకూ నాకూ వివాహం జరగదు. నాన్నగారు ఆ సంబంధాన్ని మానివేశారు.

విశ్వరథుడు:—అయితే నీవు సుదాసుని వివాహం చేసుకోవా?

రోహిణి:—(ఆర్ద్రస్వరంతో) కౌశికా !

విశ్వరథుడు:—వరుణదేవుడు బ్రతికి ఉండగానే నన్ను కాల్చి వేయతలచుకున్నట్లున్నది. (కన్నీరు తుడుచుకొంటాడు.)

రోహిణి:— (దీనంగా) విశ్వరథా! ఆనాడు నీకొరకై ఏమేమో కలలుగన్నాను.

రోహిణి: — ఆకలలనన్నింటినీ మరచిపో. నేను ఏదో చెప్ప డానికి వచ్చి ఏదో చెపుతున్నాను.

విశ్వరథుడు:—నీవు చెప్పదలచుకొన్నదేమిటి ?

రోహిణి:—శాంబరిని రేపటి ఉదయంలోగా సమర్పించకపోతే

విశ్వరథుడు:—నాకు తెలుసును.

రోహిణి:—నీకు తెలియదు. తెలియదు. పితృపాదులు ప్రాణత్యాగం చేస్తారు.

విశ్వరథుడు:—(నిశ్చేష్టుడై) ఆ ! ఏమన్నావు ?

రోహిణి:— ఇది వారి దృఢనిశ్చయం.

విశ్వరథుడు:—(ఆత్మతిరస్కార భావంతో) అయితే నేను అనార్యుడను, కులద్రోహిని... జాతిద్రోహిని... గురు హంతకుడ నవుతున్నానా ?

రోహిణి:—ఇంత మొండిపట్టు ఎందుకు పట్టుకొని కూర్చు న్నావు ? నీతో ఉన్నా శాంబరికి సుఖం ఉంటుందా ?

విశ్వరథుడు: —లేదు. పాపం ఆమెనొసట దుఃఖం వ్రాయబడి ఉన్నది కాని... కాని, (ఆక్రందనం చేస్తాడు.) రోహిణీ! దేవతలు నాకు విశ్రాంతిని ప్రసాదించకంలేదు...... మనోవాక్కాయకర్మలా శాంబరిని ధర్మపత్నిగా స్వీకరిం చాను. భయపడను. వరుణదేవుని ఆజ్ఞను ఉల్లంఘించను.

రోహిణి:—ఆమె అనార్యగదా ?

విశ్వరథుడు:—రోహిణీ! వరుణదేవుని ఆజ్ఞయే వేరు. నా హృదయంలో - నా వాణిలో - వరుణదేవుని మాటలు ప్రతిధ్వనిస్తున్నవి ఆర్యత్వం రూపంలోనూ, రంగులోనూ లేదు. అది తపస్సువల్ల లభ్యమవుతుంది. సత్యాన్నీ, ఋతాన్నీ అనుసరించడంవలన లభ్యమవుతుంది. (కొంచెంసేపు ఆగి) శాంబరిని విసర్జించమనేవారు వర్ణద్వేషాన్నీ, జాతిభేదాన్నీ, అనార్యత్వాన్నీ వాంఛిస్తున్నారు. శాంబరికోరకై నీవు భస్మమైపోతేనేగాని, ఆ భస్మంలో నుండి నిజమైన ఆర్యత్వం పరిస్ఫుటం కాదు. ఆభస్మాన్ని శరీరానికి పూసుకుని లక్షలకొలది శంబరులు ఆర్యులవుతారు.

(అంతా నిశ్శబ్దంగా ఉంటుంది.)

(నేపథ్యంలోనుండి శాంతస్వరంతో) శాంబరి: —కౌశికా!

విశ్వరథుడు:—(నిద్రలోనుండి మేల్కొన్నట్లుగా రోహిణితో దీనభావంగా) చూడు. శాంబరి నన్ను పిలుస్తున్నది. రోహిణీ! నేనేమిచేయను ? గురుదేవుల ఆదేశాన్ని మన్నిస్తే శాంబరి ప్రాణత్యాగం చేస్తుంది. - నేను మరణిస్తాను - పితృదేవతలు నన్ను శపిస్తారు.

శాంబరి:—(నేపథ్యంలో) కౌశికా!

విశ్వరథుడు:—వస్తున్నాను (లోపలికి వెళ్ళిపోతాడు.)

రోహిణి:—ఇద్దరిలో ఒకరు... రేపు... మరణించడం తప్పదు. ఎవరు మరణించినా నా మరణంగూడా నిశ్చితమే.

(అగ్నివంక తదేకధ్యానంగా చూస్తూ కూర్చుంటుంది, వెనకనుండి లోపాముద్ర ప్రవేశిస్తుంది. రోహిణి ప్రేమ పూరిత నయనాలతో చూస్తూ ఉంటుంది.)

లోపాముద్ర:—రోహిణి భుజంమీాద చేయివేసి) రోహిణీ! ఇక్కడున్నావేమిటి ?

రోహిణి:—భగవతీ! నమస్కారం.

లోపాముద్ర:—రోహిణీ! ఇక్కడున్నావేమిటి? విశ్వరథునికి నచ్చజెప్పడంకొరకై వచ్చావా?

రోహిణి:—అంతపని నేను చేయగలనా? అసలే దురదృష్ట వంతురాలను.

లోపాముద్ర:—ఏమిటితల్లీ! ఆ మాటలు?

రోహిణి:—(దుఃఖిస్తూ) భగవతీ! ఇద్దరువ్యక్తుల జీవితంతో నా జీవితసూత్రం బంధింపబడి ఉన్నది. రేపు ఉదయం ఆ ఇద్దరిలో ఒకరో లేక ఇద్దరో మృత్యుముఖంలో ప్రవేశించ నున్నారు. నా జీవితసూత్రం తెగిపోనున్నది.

లోపాముద్ర:—(ఆశ్చర్యంగా) ఆ ఇద్దరు వ్యక్తులెవరు?

రోహిణి:—పితృపాదులూ, విశ్వరథుడూను.

లోపాముద్ర:—(వెలవెలబోతుంది) ఏమంటున్నావు? అగస్త్య మహర్షియా!

రోహిణి:—అవును. మైత్రావరుణులు ప్రతిజ్ఞచేశారు. విశ్వరథుడు రేపటి సూర్యోదయంలోగా శాంబరిని విసర్జించక పోతే ప్రాణత్యాగంచేస్తారు. నేనేమిచేయను ? నాకేమీా

తోచడంలేదు. భగవతీ భగవతీ! ఏదైనా ఉపాయం చెప్పు. వారిద్దరూ లేకండా నేను ఎలా జీవించను? (ఏడుస్తుంది.)

లోపాముద్ర:—(ప్రేమగా) రోహిణీ! విశ్వరథుని హృదయంలో నీకు కూడా స్థానమున్నది. అది నాకు తెలుసును. ఏమి ఉపాయంచెప్పను? (ఆలోచించి) నేను రేపు వెళ్ళిపోతున్నాను.

రోహిణి:—(ప్రార్థనగా) భగవతీ! వెళ్ళవద్దు. వెళ్ళవద్దు. విశ్వరథుడు ఇంక ఎవరిమాటనూ వినడు. నామీద దయవుంచి వెళ్ళవద్దు.

లోపాముద్ర:—రోహిణీ! అలా బతిమిలాడవలసిన పనిలేదు. అగస్త్యమహర్షి ఇలా ప్రతిజ్ఞచేస్తారని నాకు తెలియదు. సోదరీ. నీవెంతో నేనూ అంతే. ఆ ఇద్దరిలో ఎవరు లేకపోయినా నేనుమాత్రం సహించగలనా?

రోహిణి:—(ఉలిక్కిపడి) అదేమిటి?

లోపాముద్ర:—(నవ్వుతూ) రోహిణీ! లే. కన్నీరు తుడుచుకో. ఇద్దరిలో ఎవ్వరికీ అపకారం జరగదు. నేను ప్రతిన ఉంటే. తెలిసిందా?

రోహిణి:—(ఆశ్చర్యంగా) భగవతీ!

లోపాముద్ర:—కన్నీరు తుడుచుకో. చూద్దాము. (విజయభావంతో నవ్వి) వాళ్ళిద్దరూ మనల్ని బాధపెడుతున్నారు. మనం వారిని రక్షిస్తున్నాము.

రోహిణి:—భగవతీ! భూమిపై అవతరించిన ఉమామూర్తులు మీరు.

లోపాముద్ర:—నీ విక్కడే ఉండు. కౌశికునికి కొంత ఊరట కలుగుతుంది. (నిష్క్రమిస్తుంది.)

రోహిణి:—(అగ్నివంక చూస్తూ) ఏమి కానున్నదో!!

(విశ్వరథుడు శాంబరిని నెమ్మదిగా పట్టుకొని తీసుకొని వస్తాడు. శాంబరి వయస్సు ఇరవై సంవత్సరా లుంటుంది. గర్భవతి. చాలా కష్టంగా నడుస్తున్నది. విశ్వరథుని ధ్యాస తప్ప ఆమెకు ఇంకొక ధ్యాసయే లేదు.)

విశ్వరథుడు:—ఉగ్రా! చూడు. ఈమెయే రోహిణి.

ఉగ్ర:—(నెమ్మదిగా) రోహిణీ!

(విశ్వరథుడు ఆమెను కూర్చోబెడతాడు.)

రోహిణి:—ఏమి సోదరీ! ఆరోగ్యం ఎలా ఉన్నది?

ఉగ్ర:—(భయపడి) ఓఫ్—మీ భైరవుని కుమార్తె గాదూ ఆమె? మీ భైరవుడు నా తండ్రిని చంపించివేశాడుగదూ!

విశ్వరథుడు:—అవన్నీ మరచిపో శాంబరీ! వారు నా గురువులు. తండ్రికంటే ఎక్కువ పూజ్యులు. నేనూ, ఈమే అగస్త్యాశ్రమంలో ఒక్కటిగా పెరిగి పెద్దవాళ్ళమయినాము.

రోహిణి:—(దయార్ద్రస్వరంతో) సోదరీ! భయపడకు.

(శాంబరి ఏమీ మాట్లాడదు.)

రోహిణి:— విశ్వరథా! నేను బాల్యస్నేహితురాలను, అంతేగదా? వెళ్ళివస్తాను. (లేచి వెళ్ళబోతుంటుంది) ఇంతలో ప్రతర్దనుడు రొప్పుకుంటూ ప్రవేశిస్తాడు)

విశ్వరథుడు:—(ప్రతర్దనుని చూచి) ప్రతర్దనా! ఏమిటి సంగతి?

ప్రతర్దనుడు:—(వ్యాకులంగా) రాజన్! గురుదేవులు ప్రాణత్యాగం చేయడానికి ప్రతిజ్ఞ చేశారు.

విశ్వరథుడు:—(ఖేదంగా) అవును.

ప్రతర్దనుడు:—దివోదాసు సైన్యాన్ని ఆయత్తం చేస్తున్నాడు.

విశ్వరథుడు:—ఎందుకు?

ప్రతర్దనుడు:—మీ ప్రయాణాన్ని ఆపివేయడానికి.

విశ్వరథుడు:—సరే. మన సైన్యాన్ని కూడా ఆయత్తంచేయి.

ప్రతర్దనుడు:—రాజన్!

విశ్వరథుడు:—సందేహమెందుకు? చెప్పు.

ప్రతర్దనుడు:—భరతశ్రేష్ఠా! గురుదేవుని ప్రతిజ్ఞ విషయం అందరికీ తెలిసింది. అందువలన... అందువలన...

విశ్వరథుడు:—అందువలన భరతులు నా పక్షంలో యుద్ధం చేయరు, అంతేగదా? (ప్రతర్దనుడు అవునన్నట్లు తల ఆడిస్తాడు.) ప్రతర్దనా! సరే, నీవు వెళ్లు.

ఉగ్ర:—(విశ్వరథుని చెయ్యి పట్టుకొంటుంది.) విశ్వరథా! నన్ను వదలివేస్తావా?

విశ్వరథుడు:—శాంబరీ! భయపడకు. (ప్రతర్దనునితో నిశ్చయపూర్వకంగా) వెళ్లు వెళ్ళి భరతుల కందరికీ స్వాతంత్ర్యమిచ్చాననని చెప్పు. రోహిణీ! నీవుగూడా వెళ్లు, గురుదేవునికి

ఈ విషయం మనవిచెయ్యి. (గంభీరంగా ఆకాశంవంక చూస్తాడు.) వరుణదేవుడు తన పుత్రుని తిరిగి పిలిపించుకుంటున్నాడు. (ద్వారంలోనుండి లోపలకు ప్రవేశిస్తున్న ఎండనుచూచి) వెళ్ళండి. నేను విశ్వాసం కలుగజేస్తాను.

రోహిణి:—ఏమిటి ?

విశ్వరథుడు: (ఉత్సాహంగా) శాంబరికి ఆర్యత్వం లభించింది.

రోహిణి:—ఏమిటి ఈమాటలు !

విశ్వరథుడు:—సూర్యదేవుని ఎదుట ఆ విషయం ఋజువు చేస్తాను.

రోహిణి:—(భయపడి విశ్వరథుని శిరస్సుమీద తన చెయ్యి పెడుతుంది. శిరస్సు వేడిగా ఉంటుంది.) అబ్బా !

పరితర్గనుడు:—రాజన్ ! రాజన్ ! !

ఉగ్ర:—విశ్వరథా ! నన్ను వదలకు, విశ్వరథా ! (విశ్వరథుని చెయ్యి పట్టుకొంటుంది విశ్వరథుడు సూర్యబింబంవంక చూస్తుంటాడు.)

విశ్వరథుడు:—(ప్రార్థనగా) దేవా ! చెప్పు - చెప్పు - ఉగ్రకు ఆర్యత్వం లభించిందా లేదా ? నేను గాధిపుత్రుణ్ణి, మైత్రావరుణుని శిష్యుణ్ణి, ప్రశ్నిస్తున్నాను. (నీరు తీసుకొని శాంబరిమీద చిలకరిస్తాడు.) సత్యఋతాలద్వారా ఈమెను అభిమంత్రితం చేశాను. (ఆకాశంవంక, సూర్యబింబంవంక తదేకధ్యానంగా చూస్తాడు, ఉత్సాహంతో) ఉగ్రా ! సవితృదేవత దర్శన మిస్తున్నాడు, నమస్కరించు. చేతులు జోడించు. అను, అను. ఓం తత్సవితుర్వరేణ్యం.

ఉగ్ర:—(భయంగా) తత్సవితుర్వరేణ్యం.
విశ్వరథుడు:—భర్గో దేవస్య.
ఉగ్ర:—భర్గో దేవస్య.
విశ్వరథుడు:—ధీమహి.
ఉగ్ర:—ధీమహి.
విశ్వరథుడు:—ధియో యోనః ప్రచోదయాత్.
ఉగ్ర:—ధియో యోనః ప్రచోదయాత్.
విశ్వరథుడు:—(స్మృతిలో లేడు) సవితృదేవతా! ఉగ్రకు ఆగ్న్యత్వం లభించిందా లేదా? లభించిందా లేదా?

(సూర్యబింబం పెద్దదవుతుంది. ఆ బింబం బంగారు రథంగా మారుతుంది. సూర్యుడు ప్రత్యక్షమౌతాడు. బంగారపు కవచాన్నీ, కిరీటాన్నీ ధరించి ఉంటాడు. ప్రతర్దనుడు భూమిమీదకు వొరిగి నమస్కారం చేస్తాడు. రోహిణి నమస్కారం చేస్తుంది. విశ్వరథుడు ప్రార్థన చేస్తూనే ఉంటాడు.

సూర్యదేవుడు:—లభించింది. (దిక్కులు ప్రతిధ్వనిస్తవి) (నెమ్మదిగా సూర్యదేవుడు అదృశ్యుడవుతాడు. విశ్వరథుడు మూర్ఛనొంది నేలమీద పడిపోతాడు.)

తెర పడుతుంది.

# నాలుగో దృశ్యం

(అగస్త్యుని ఆశ్రమవనమూ, భరతుల ఉద్యానవనమూ కలిసేచోట నున్న పొదరిల్లు. దానికి ప్రక్కగా రెండు మార్గాలు కనపడుతూ ఉంటవి. కుడివైపుమార్గం గ్రామానికి పోతుంది. ఎడమవైపుమార్గం అగస్త్యాశ్రమంలోనికి పోతుంది. కొంచెం దూరంగా సరస్వతీనది ప్రవహిస్తూ ఉంటుంది. నదిలో రెండు మూడు నావలు కనపడుతూ ఉంటవి. దగ్గరగా ఒక పెద్ద రావిచెట్టు కనపడుతూ ఉంటుంది. ఆ చెట్టుకు నలువైపులా మల్లెతీగలు వ్రేలాడుతూ ఉంటవి. మల్లెపూలు వికసించి ఘుమఘుమ లాడుతూ ఉంటవి.

లోపాముద్ర ప్రవేశిస్తుంది. ఆమె మృగచర్మం ధరించి ఉంటుంది వెన్నెల కొద్దికొద్దిగా ప్రకాశిస్తూ ఉంటుంది.)

లోపాముద్ర:—సరస్వతీమాతా! నేను నీ పుత్రికనయితే, జీవితమంతా సత్యాన్ని ఆరాధించి ఉన్నట్లయితే నాకు సద్బుద్ధిని ప్రసాదించు. (చేతులు జోడించి) వాగ్దేవీ భారతీ! భరతులను ఉద్ధరించుటకు దయచేయి. ఓమాతా! నా వాణిలో నివసించు (చంద్రునివంక చూచి) సోముడా! నీ అనుపమాన సౌందర్యగరిమతో నన్ను ఆనంద పరుచు. దేవీ! మాతా! నీ పుత్రికసర్వాంగములను కాంతితో నింపివేయి. నాహృదయంలో స్థిరపడిన ఇద్దరు వ్యక్తులూ ఒకరినొకరు ద్వేషించుకొనేవారు కారు. కాని

ప్రస్తుతంవారిద్దరూ పరస్పరం ఒకరికొకరు పరమశత్రువు
లై పోయినారు (మేఘాల వైపుచూచి) వరుణదేవా! దేవాధి
దేవా! ఇద్దరూ నీ పుత్రులే. ఇద్దరూ నీకు ఇష్టులే. వారిని
ఉద్ధరించగలిగేశక్తిని నాకు ప్రసాదించు. (క్రొంచెంనవ్వి)
అగ్నిదేవా! నా లజ్జను కాల్చి భస్మంచేయి, మరుత్తులారా!
నా సంయమాన్ని ఎగరగొట్టి వేయండి. (రెండుచేతులూ
జోడించి మోకాళ్ళమీద కూర్చొని ప్రార్థన చేస్తుంది.
గల గల ఆకులు చప్పుడవుతవి. లేచి చెట్టు చాటుకు
పోతుంది)

(ఉగ్ర ఏడుస్తూ ప్రవేశిస్తుంది. ఆమెనుచూచి అశ్వత్థ
వృక్షంమీదినుండి ఒక పక్షి లేచిపోతుంది. లోపాముద్ర
చెట్టుచాటునుండి ఆమెను వీక్షిస్తూ ఉంటుంది.)

ఉగ్ర:—చంద్రదేవా! తండ్రీ! విశ్వరథుని కేమిసంభవించిందో
చెప్పు, మూడురోజులనుండీ విశ్వరథుడు ఒక్కసారిగూడా
నవ్వలేదు, ఆయన నవ్వుముఖం చూడడానికి తపించిపోతు
న్నాను. విశ్వరథుని సహజమందహాసం ఏమైపోయిందో
చెప్పు, తండ్రీ! (కన్నీరు తుడుచుకొంటుంది) నేను చాలా
దురదృష్టవంతురాలను. నాకు తండ్రి లేడు, తల్లి లేదు,
జాతి లేదు, నాకున్న సర్వస్వమూ ఆ విశ్వరథుడొక్కడే,
విశ్వరథుడుగూడా లేకపోతే నే నెక్కడకు పోగలను?
(ఆలోచించి) నామీద కోపగించినావా? విశ్వరథునికి
నేనంటే ఇష్టంలేదా? ఆయన చిత్తాన్ని ఇంకెవరైనా
దొంగిలించుకొనిపోయినారా? నేనేమిచేయను?

(అశ్వత్థవృక్షంక్రింద కూర్చుంటుంది)

ఓ అశ్వత్థవృక్షరాజమా! నాఆత్మీయులందరూ మృత్యుముఖంలో పడిపోయినారు. ఒక్కనీవుమాత్రమే నాకు సహాయంగా ఉన్నావు. నీవు దేవతవుకావని విశ్వరథు నుగాక. నాతల్లీ, నా తల్లితల్లీ నిన్నే పూజించారు కౌశికునిదేవతలను చూస్తే నాకు భయంకలుగుతున్నది. ఓ అశ్వత్థవృక్షమా! నన్ను రక్షించు. నేను నీ పాదును బాగుచేస్తాను కుంకుమాక్షతలతో నిన్ను పూజిస్తాను. నా కౌశికుడు నవ్వితే అంతే చాలును. రోజూ నిన్ను పూజిస్తాను.

(కళ్ళు మూసుకొని కొంతసేపు నిలబడుతుంది.)

ఓ అశ్వత్థవృక్షమా! నీకు తెలియనిదేమున్నది? నాతండ్రి కౌశికుని బంధించాడు. అతణ్ణి చూడగానే నన్ను నేను ఆపుకోలేకపోయినాను. నేను పిలుపనంపితే విశ్వరథుడు వచ్చాడు. నా కళ్ళల్లో నివసించాడు—నేను జీవించాను. (కొంతసేపు కళ్ళుమూసుకొంటుంది.)

తండ్రీ! అశ్వత్థవృక్షరాజా! ఆగౌరాంగి వచ్చిననాటి నుండీ విశ్వరథుని చిత్తం వికలమైపోయింది. ఆ గౌరాంగికి పరుల చిత్తాన్ని దొంగిలించే కళ తెలుసును. ఆమె వాణిలో ఏదో ఇంద్రజాలమున్నది. నేను ఆర్యరమణి నయినానని విశ్వరథు డంటున్నాడు. అయినాసరే. వృక్షదేవతా! నేను నిన్నే పూజిస్తాను. ఆ కౌశికుని ఆ హాస్య మెక్కడ దాగి ఉన్నదో చెప్పు.

(అశ్వత్థవృక్షానికి తల ఆనిస్తుంది. లోపాముద్ర కళ్ళు తుడుచుకుంటూ బయటకువచ్చి ఉగ్రభుజంమీద చెయి వేస్తుంది.)

లోపాముద్ర:—ఉగ్రా! ఏమి చేస్తున్నావమ్మా!

ఉగ్ర:—(ఉలిక్కిపడి) గౌరాంగీ! ఎక్కడనుండి వచ్చావు?

లోపాముద్ర:—నే నిక్కడనే తిరుగుతున్నాను. నీ కంఠధ్వని విని ఇటువచ్చాను.

ఉగ్ర:—భగవతీ! నావెంటపడ్డావేమిటి? నేను నీకు ఏమి అపకారం చేశాను?

లోపాముద్ర:—పిచ్చిపిల్లా! ఏమిటమ్మా ఆమాటలు!!

ఉగ్ర:—గౌరాంగీ! నీ దర్శనం అయిననాటినుండి నా అదృష్ట రేఖ మారిపోయింది. నీవు వచ్చావు—కౌశికుడు తన హృదయపీఠంమీదనుండి నన్ను క్రిందకు దింపివేశాడు. మాకోటను వదలివేయడానికి తొందరపడ్డాడు— నీవల్లనే నాతండ్రి మరణించాడు—తల్లి మరణించింది—అందరూ మరణించారు. నేను మిగిలితే నన్నుగూడా వెంబడించావు.

లోపాముద్ర:—సోదరీ! నీవు భయపడిఉన్నావు. నీకూ, నీ విశ్వరథునికీ నేను తప్ప సహాయం ఎవ్వరూ లేరు.

ఉగ్ర:— (భయపడి) నిజమా? అయితే మాగతి ఏమి కానున్నది?

లోపాముద్ర:— (మమకారపూర్వకంగా) ఉగ్రా! నీవు మా ఆర్యుల స్వభావాన్ని ఎరుగవు. నీవు కౌశికుని సుఖపెట్టుకంలేదు. అతడు నీ కొరకై రాజ్యాన్ని, ప్రతిష్ఠనూ, జీవితాన్ని వదలుటకు సిద్ధంగా కూర్చున్నాడు.

ఉగ్ర:—(శిరస్సు మీద చెయ్యిపెట్టుకొని), గౌరాంగీ! నీవు

చతురురాలవు. ఈమాటలతో నా కౌశికుని కాజేయ దలచావా?

లోపాముద్ర:—మూర్ఖురాలా! ఇంకా నీకు అర్థంకాలేదు. అతడు నా పుత్రుడు.

ఉగ్ర:—అయితే అతనిని కాజేస్తున్నావెందువల్ల?

లోపాముద్ర:— ఉగ్రా! జాతిశుద్ధిపేరుతో అసురులకంటే మేము భయంకరుల మవుతున్నాము. నేను నీ హితాన్ని కాంక్షిస్తున్నాను.

ఉగ్ర:—(కన్నీరు కారుస్తూ) నేనెంతటి దురదృష్టవంతురాలను!! తండ్రిని పోగొట్టుకొన్నాను. కౌశికునిగూడా పోగొట్టు కొనుటకు సిద్ధంగా ఉన్నాను. (ఏడ్చి) తల్లీ! నాకెవ్వరూ లేరు. (కాళ్ళమీద పడుతుంది.)

లోపాముద్ర:—ఉగ్రా! భయపడకు. విను. నీ కారణంవల్లనే ఆర్యజాతి విశ్వరథునిమీద తిరగబడినది. నా మాటను మన్నించి నా ఆశ్రమంలోనికి రా. నా కుమార్తెవలెనే నిన్ను చూచుకొంటాను. ప్రసవించిన తరువాత కౌశికునికి నిన్ను సమర్పిస్తాను.

ఉగ్ర:—నేను వెళ్ళిపోతే కౌశికుడు సంరక్షింపబడతాడా? లేదు. లేదు. కౌశికుని వదలి నేను ఎక్కడకూ రాను.

లోపాముద్ర:—కౌశికుని వదలకపోతే రేపు ఉదయం అతడు జీవించడం దుర్లభం. విశ్వరథునిగూడా నాతో రమ్మంటున్నాను. విశ్వరథుడు రాకపోయినా నీవు తప్పకరావాలి.

(ఉగ్ర ఆలోచిస్తుంది విశ్వరథుడు ప్రవేశిస్తాడు. ముఖం వాడిపోయి ఉంటుంది.)

విశ్వరథుడు:—(ఖేదంగా) ఉగ్రా! నీ విక్కడున్నావా? (లోపాముద్రవంక చూచి) ఎవరు? భగవతీ! (ఉగ్రతో) ఈ చలిలో ఇక్కడ బాధపడతావు. నిన్నే వెదకుతున్నాను. (ఉగ్ర భుజంమీద ప్రేమగా చెయ్యి వేస్తాడు.)

లోపాముద్ర:—నీవు రావటంకూడా మంచిదయింది. విశ్వరథా! నిన్ను కలుసుకొందామని వచ్చాను. నీవు కనపడ లేదు. (నెమ్మదిగా) రేపు ఉదయమే నా ప్రయాణం.

విశ్వరథుడు:—భగవతీ! నీవు వెళ్ళిపోతున్నావా? నేనెప్పుడు వెళ్ళతానో ఆ ద్యావాపృథ్వీనాథునకే తెలుసును. అప్పుడప్పుడు నివాపాంజలిని వదలుతూ ఉండు. పితృలోకములో ఉండి సంతృప్తి నొందుతాను.

లోపాముద్ర:—విశ్వరథా! ఏమిటి ఆమాటలు! నా హృదయం బ్రద్దలై పోతున్నది. ప్రయాణసమయంలో ఇలాంటి అమంగళకరమైన మాటలు మాట్లాడవచ్చునా?

(ఉగ్ర దీనవదనంతో చూస్తూఉంటుంది.)

విశ్వరథుడు:—భగవతీ! భగవతీ! నామాట సత్యమయింది. శాంబరి ఆర్యఅయినది.

లోపాముద్ర:—(ఆశ్చర్యంగా) ఏమిటి?

విశ్వరథుడు:—గురుదేవుని ప్రతిజ్ఞను వినగానే క్షణకాలం నా మనస్సులో సందేహం బయలుదేరింది. దస్యుకన్యను

ఆర్యరమణిగా మార్చగలనాఅని అనుకొన్నాను. దేవతలను ఆవాహన చేశాను.

లోపాముద్ర:—తరువాత ?

విశ్వరథుడు:—తరువాత సత్యఋతాలతో శాంబరిని అభిమంత్రితం చేశాను. (ప్రకాశమానమైన నేత్రాలతో) భగవతీ! సూర్యదేవుడు దర్శనమిచ్చాడు.

లోపాముద్ర:—(స్తబ్ధురాలై) ఆ!!

విశ్వరథుడు: స్వర్ణకవచ కిరీటాలతో సూర్యదేవుడు దర్శనమిచ్చాడు. రోహిణీ ప్రతర్దనులు అక్కడనే ఉన్నారు.

లోపాముద్ర:—(భావపూర్ణంగా విశ్వరథుని భుజాలమీద చేతులు వేసి) విశ్వరథా! దస్యుజాతిని ఆర్యజాతిగా మార్చే మంత్రాన్ని దర్శించావు. ఈనాటివరకు ఏ మహర్షి చేయని—చేయలేని పనిని నీవు చేసి చూపించావు. నీకు సాధువాదాలు. పుత్రకా! నా హృదయాన్ని చీల్చి నాహర్షాన్ని నీకు ఎలా చూపించను? (ప్రశంసాపూర్వకంగా) నీవు ఆర్యజాతిని ఉద్ధరించావు.

విశ్వరథుడు:—ఆర్యులు నన్ను బహిష్కరించివేశారు. రేపు నాగతి ఏమికానున్నదో!!

లోపాముద్ర:—విశ్వరథా! నాతో రారాదా ?

విశ్వరథుడు:—(ఆలోచించి) మీ ఆశ్రమానికేనా ? భగవతీ! భగవతీ! గురుదేవులు, వశిష్ఠుడు, భరతులు, అందరూ ఈనాడు నన్ను ఎగతాళి చేస్తున్నారు. ఇలాంటి సమయంలో

ఇక్కడినుండి నేను వెళ్ళిపోతానా? లేదు. (దృఢంగా) నా మంత్రదర్శనంలో సత్యముంటే – దేవాధిదేవుడు సూర్యదేవుడు దర్శనమిచ్చిన ఈ ప్రదేశంలో నుండియే— మంత్రోచ్చారణచేస్తూ పితృలోకంలో సంచరిస్తాను. (వినయంగా) సత్యంకోరకు నా సర్వస్వాన్ని సమర్పణ చేస్తాను. ఈ సమర్పణలో నా శరీరంలోనుండి వెలువడిన రక్తప్రవాహం ఈ సరస్వతీ నదీజలంకంటె పవిత్రమై సప్తసింధును పాపముక్తం చేస్తుంది,

లోపాముద్ర:—పుత్రకా! నా జీవితం ధన్యమైనది. నీలో విశ్వామిత్రుణ్ణి దర్శిస్తున్నాను.

విశ్వరథుడు:—(లోపాముద్ర పాదములకు నమస్కరించి) భగవతీ! ఇదంతా మీ ఆశీర్వాదబలమే. మీ ఆశీర్వాద బలంవల్లనే నేను ఋషి పదవిని పొందగలిగినాను. మీ స్మరణతోనే ప్రాణాలను వదలి పెడతాను.

లోపాముద్ర:—(వంగి విశ్వరథుని లేవదీస్తుంది) పుత్రకా! నా ప్రాణాలనైనా సమర్పించి నిన్ను బ్రతికించుకోవ గలిగితే ఆనందిస్తాను. ఉగ్ర చలికి వణుకుతున్నది. ఉగ్రా! సోదరీ! పద.

(లోపాముద్ర ఎంతో ప్రేమగా ఉగ్రను లేవతీస్తుంది.)

(విశ్వరథుడు ఉగ్ర నడుముమీద చేయివేసి ఆమెను భారంగా నడిపించి తీసుకొనిపోతాడు. లోపాముద్ర అటువైపు చూస్తూ నవ్వుతూ వెళ్ళిపోతుంది. రాజీ ఋతుడు ప్రవేశిస్తాడు. నలుమూలలా చూస్తాడు – ఎవ్వరూ కనిపించరు.)

అజీగర్తుడు: గ్రామమంతటిలోనూ నేను ఒక్కణ్ణే దురదృష్ట వంతుణ్ణి. ఏనాడు నాభార్య ఇంట్లో ప్రవేశించిందో అన్నీ విఘ్నాలే. (తలకొట్టుకొంటాడు.) అందరూ భగవతితో వెళ్ళిపోతూఉంటే నేను ఆమె ప్రసూతికర్మకొరకు కూర్చో వలసివచ్చింది. ఇలాంటిభార్య ఎవ్వరికీ ఉండదనుకొంటాను. భగవతి ఆశ్రమానికి పోవటంకొరకు అన్నిప్రయత్నాలూ పూర్తిచేసుకొన్నాను. ఇంతలో అక్కడ ఆమెకు ప్రసవ వేదన ప్రారంభమయింది. భగవతి ఇక్కడనే ఉన్నదన్నారే! ఎక్కడున్నదో! (దివోదాసు లోపాముద్ర అగస్త్యులు ప్రవేస్తారు. లోపాముద్ర అద్భుతంగాకన్పిస్తూ ఉన్నది అగస్త్యుని ముఖం భయంకరంగా ఉన్నది. దివోదాసుకూడా గంభీరంగా ఉన్నాడు.)

దివోదాసు:—ఎవరు ?

అజీగర్తుడు:—నేను అజీగర్తుణ్ణి. భగవతిని కలుసుకొందామని వచ్చాను. భగవతీ! రాజా! గురువర్యా! వందనాలు.

లోపాముద్ర:—శతంజీవివికమ్మ. ఏమిటినాయనా సంగతులు?

అజీగర్తుడు:—దుఃఖసముద్రం మధ్యలో పడిపోయినాను. భగవతీ.

లోపాముద్ర:—ఎందువల్ల ?

అజీగర్తుడు:—మీతోబాటు మీ ఆశ్రమానికి రావలెనని అనుకొన్నాను. కాని నా కాగీత ఉన్నట్లు కనపడటంలేదు. నా భార్యకు ప్రసవవేదన ప్రారంభమయింది.

లోపాముద్ర:—ప్రయాణం మానివేసెయ్యి.

అజీగర్తుడు:—నన్ను తరువాత రమ్మంటారా ?

లోపాముద్ర:—తరువాతనైనా రావచ్చును, కాని నేను చెప్పిన మాటలు జ్ఞాపకం ఉన్నవా ?

అజీగర్తుడు:—ఏమిటి ?

లోపాముద్ర:—నాతో వచ్చినవారందరూ పశ్చాత్తాప పడతారు.

అజీగర్తుడు:—నాకు ఆదిగులు లేదు.

లోపాముద్ర:—అయితే నీ ఇష్టం.

(అజీగర్తుడు ముగ్గురికీ నమస్కరించి వెళ్ళిపోతాడు.)

లోపాముద్ర:—అగస్త్యమహర్షీ! మీ శిష్యులందరూ మీ ఆశ్రమాన్ని వదలి వాతో వస్తున్నారు.

అగస్త్యుడు:—అవును:

దివోదాసు:—(గంభీరంగా) లోపాముద్రా ! నీవు తలుచు కొంటే గ్రామమంతా నీతోనే వస్తుంది. ఆకాశంలో ఉష, భూమిమీద లోపాముద్ర ఇద్దరూ ఒక్కటిగానే ఉన్నారు. ఎంతచూచినా తనివితీరదు.

లోపాముద్ర:—ముసలితనంలో ఉన్న మీరు నన్ను ఎగతాళి చేస్తున్నారా ? (నలువైపులాగల ప్రకృతిని చూపించి) చూడండి. నలువైపులా ప్రకృతి ఎంత మనోహరంగా ఉన్నదో ! మీతగాదాలతో ఈప్రకృతికి ఏమీ సంబంధం?

అవునా ? సరస్వతీనదీతటం, అగస్త్యతపోవనం, అమృతాన్ని స్రవింపజేస్తూఉన్న వెన్నెల !!

దివోదాసు:—మిగిలినలోటును నీవు పూర్తి చేశావు. అవునా! లోపాముద్రా ! నీ విక్కడే ఎందుకుండగూడదు ?

లోపాముద్ర:—అతిథిగా ! నేను సరస్వతీనదిలాంటి దానను. నాఇష్టంవచ్చినచోటికి ప్రవహించిపోతాను.ఆప్రవాహంలో ఎవ్వరూ మునిగిపోకుండాఉంటే చాలును.

దివోదాసు:—లోపాముద్రా ! ముసలితనం వచ్చినప్పుడో ?

లోపాముద్ర:—(వినోదంగా) నా ఆశ్రమముంటుంది. కొంత మంది శిష్యులు ఉంటారు. రాజా! అందుకై చింతించకు. (నవ్వి)ఆరోజును నేనుచూడను. ఉషాదేవి నాసౌందర్యాన్ని రక్షిస్తున్నది. నిన్న నేను ఎంత అందంగా ఉన్నానో, ఈ ఈరోజు అంతకంటే అందంగా ఉంటున్నాను. మహర్షీ ! ఏమిటి ఆలోచిస్తున్నారు ?

అగస్త్యుడు:—ఏమీలేదు.

దివోదాసు:—లోపాముద్రా ! నేను ఈ ముసలితనంలో బాలకుణ్ణి కాగలిగితే నీ ఆశ్రమానికి వచ్చేవాణ్ణి.

లోపాముద్ర:—రాజా ! మీరిక్కడనే శోభిస్తారు. మీరు లేకపోతే ఈ రాజ్యభారాన్ని ఎవరు వహిస్తారు ? ఈ యుద్ధాలు ఎవరు చేస్తారు ?

దివోదాసు:—లోపాముద్రా ! నాకు పనులున్నవి. వెళ్ళిపోతాను. నావలు సిద్ధంగా ఉన్నవి. రేపు ఉదయం నిన్ను కలుసుకోగలనో లేనో చెప్పలేను.

లోపాముద్ర:—మీరు నన్ను కలుసుకోలేరా? అదిసంభవమా? మీరిద్దరూ ఇక్కడ ఉండగా ఒక్కమాట అడుగుదామను కొంటున్నాను.

దివోదాసు:——ఏమిటి ఆమాట ?

లోపాముద్ర:—శంబరకన్యఅంటే మీకు అంతవైర మెందుకు? ఎంతమంది ప్రాణాలు బలితీసుకొంటూరు ? అగస్త్యమహర్షీ! మీరు ఏమిచేస్తున్నారో ఆలోచిస్తున్నారా ?

అగస్త్యుడు:—(ఉగ్రంగా) భారద్వాజీ! ఈ విషయం నీతో మాట్లాడడం అనవసరం. (తిరస్కారంగా) ఈ జరుగుతున్న కాండలో నీవుమాత్రం తక్కువ పాల్గొంటున్నావా ?

లోపాముద్ర:— (గర్వంగా) అవును. నేను ఎక్కువగానే పాల్గొంటున్నాను. మునిపదవిలో ఉన్నాననే గర్వంవలన మీరు సరిగా అర్థంచేసుకోలేకపోతున్నారు. (అగస్త్యుని నడుముమీద చెయ్యివేసి) ఎవరిని మూర్ఖుడని అనుకొంటు న్నారో అతడు ఈరోజు మంత్రదర్శనం చేశాడనే సంగతి మీకు తెలుసునా ? అతడు సూర్యదేవుని సాక్షాత్కారం పొందాడు. శాంబరిని ఆర్యగా చేశాడు. ఆర్యావర్తాన్ని ఉద్ధరించాడు. తెలిసిందా.

అగస్త్యుడు:—(కఠోరంగా) భారద్వాజీ! ఆ విషయం నాకు రోహిణి చెప్పింది.

లోపాముద్ర:—అయినా మీ భావం మారలేదా ? అతిథిగ్వా! మీరిద్దరూ ఏమిచేయబోతున్నారో ఆలోచించారా ?

దివోదాసు:—నేనేమి చేయను? మైత్రావరుణులు మృత్యువును ఆలింగనం చేసుకొంటూ ఉంటే చూస్తూ కూర్చోనా?

లోపాముద్ర:—రాజన్! విశ్వరథుని ప్రయాణం ఆపుదామనుకొంటున్నావు. భరతులు విశ్వరథుని వదలివేశారు. (తిరస్కారంగా) మీ గర్వానికి, మీ అభిమానికి హద్దు లేకుండా ఉన్నది. అతడు విశ్వరథుడు కాడు. విశ్వామిత్రుడు. భవిష్యత్తులో ఆర్యజాతి నిన్నూ, నన్నూ మరచిపోతుంది. కాని విశ్వామిత్రుని స్మరించి ముక్తిని పొందుతుంది.

దివోదాసు:—. లోపాముద్రా! నన్నేమి చేయమంటావు? శంబరకన్యను రాజమహిషినిగా అంగీకరించడం సంభవమా?

లోపాముద్ర:—విశ్వామిత్రునికి నీ సింహాసనంతోనే పని లేదు.

అగస్త్యుడు:—భారద్వాజీ! (దృఢంగా) అనవసర ప్రయాసకు లోనుగాకు. సూర్యదేవుడు గతితప్పినా నేను నా ప్రతిజ్ఞను మార్చుకోను. విశ్వరథునకు గురువన్నా, ఋషివిద్యఅన్నా, నా ప్రాణాలన్నా గౌరవం ఉంటే ఒక్కటే ఉపాయమున్నది. శంబరకన్యను నాకు సమర్పించివేరాలి. అతడు అలాచేయకపోతే నా తపస్సంతా వ్యర్థమైపోయిందనుకొంటాను. తపస్సు వ్యర్థమైన తరువాత నేను జీవించడ మెందుకు?

లోపాముద్ర:— మంత్రద్రష్టయగు మైత్రావరుణులు కాదు మాట్లాడుతున్నది. ఆత్మగౌరవభావంతో మత్తుడైన పురోహితుడు మాట్లాడుతున్నాడు.

దివోదాసు:—(భయపడి) లోపా! లోపా! ఏమిటి ఆమాటలు!

లోపాముద్ర:— రాజన్! ఇవి అగస్త్యమహర్షి ఇదివరకు వినని మాటలు – వినడం అవసరమైన మాటలు.

అగస్త్యుడు:—కానీ (తిరస్కారంగా) ఆర్య అనార్యభేదాన్ని నీవు అర్థంచేసుకోలేవు.

లోపాముద్ర:—మునివర్యా! ఆర్యులనీ, అనార్యులనీ, నల్లవారనీ, తెల్లవారనీ ఉత్తములనీ, అధములనీ మహర్షులు పాటించరు పాటించకూడదు. (కంపించే స్వరంతో) విద్యఅన్నా, తపస్సన్నా గౌరవముంటే నాతోకూడా రండి. అడవులలోనికి దూరంగా పోదాము. ఆకలిదప్పికలచే, దుఃఖాతిరేకంచే దోవతప్పిన—దోవ తెలియక తిరుగుతున్న—మానవులు – మార్గాన్వేషణలో మనకొరకై ఎదురు చూస్తున్నారు. అభిమానాన్ని వదలండి—పురోహితపదవిని వదలండి. నాతోరండి. శీతలవృక్షచ్ఛాయలలో కూర్చుందాము. ఒకే మృగచర్మాన్ని ఇద్దరమూ పంచుకుందాము. కామదేవులు అసంపూర్తిగా వదలినదానిని సంపూర్తి చేదాము.

అగస్త్యుడు:—భారద్వాజీ! నేను సరిగానే ఉన్నాను.

లోపాముద్ర:—మంచిది. ఈనాడు కాకపోతే ఇంకొకరోజున అయినా సరే—నా యీ ఆహ్వానాన్ని మీరు అంగీకరించకతప్పదు. కాని ఒక్కపని చేస్తారా? ఉగ్రను నాతో తీసుకొనిపోవడానికి మీరు అంగీకరిస్తారా?

అగస్త్యుడు:—తిరిగి శాంబరిని విశ్వరథునికి అప్పగిస్తావా?

లోపాముద్ర:—మీకు ఇంకా విశ్వాసం కలుగలేదా?

అగస్త్యుడు:—నీ ఉద్దేశ్యమేమిటి ?

లోపాముద్ర:— ఉద్దేశ్యమేమిటో మీకు తెలియజేయాలా ? సరస్వతీ దివోదాసులు సాక్షిగా చెప్తున్నాను. గర్వ ప్రధానమైన మీ ప్రవృత్తికి నా మాట నచ్చకపోవు గాక. వినండి – భారద్వాజుని కుమార్తె లోపాముద్ర ఇద్దరికిమాత్రమే తన హృదయంలో స్థాన మిచ్చింది.

దివోదాసు:—లోపాముద్రా!

లోపాముద్ర:—అవును. రాజన్ ! జ్ఞాపకమున్నదా ? మీరు నన్ను వివాహమాడుదామనుకున్నారు కాని, నేడు నేను వివాహంచేసుకొందామనుకొన్న ఒక్కవ్యక్తి లభించాడు. రెండోవ్యక్తి పుత్రునికంటె ఎక్కువగా నా మనోరథాలను ఈడేరుస్తున్నాడు. ఆ ఇద్దరూ ఈనాడు ఒకరికొకరు శత్రువులై ఉన్నారు. పితృదేవతలుసాక్షిగా నే జీవించి ఉన్నంతకాలమూ ఆ ఇద్దరినీ ఇష్టంవచ్చినట్లుగా ప్రవర్తించనీయను.

దివోదాసు:—నిజమా ! నీవు దేవదుహితవు; నిన్ను ఇంద్రుడు మమ్ము ఉద్ధరించడానికి పంపించాడు.

లోపాముద్ర:—ఉద్దేశ్య మేమిటో తెలిసిందా ?

(దివోదాసు కన్నీరు తుడుచుకొంటూ వెళ్ళిపోతాడు.)

అగస్త్యుడు:—ఈమాటలు చెప్పడంకొరకేనా నన్ను పిలిపించింది ? ఇక వెళ్ళవచ్చునా ?

లోపాముద్ర:—వెళ్ళవచ్చును. కాని మైత్రావరుణా ! నన్ను

చూచి పారిపోతావెందువల్ల ? హృదయనిర్ఝరులు ఆపినా ఆగుతవా ?

అగస్త్యుడు:—లోపాముద్ర అపహరింపబడినదని తెలియగానే ఆబాలవృద్ధులు ఆర్యులు యుద్ధానికి సంసిద్ధులైనారు. లోపాముద్రను చూచినప్పుడు ఋచీక దివోదాసులకు గూడా నవయౌవనంలో ప్రవేశించినట్లనిపించేది. మరణోన్ముఖుడైన శంబరుని నేత్రాలనుండి అమృతవెల్లువలు ప్రవహించినవి. మహర్షులు సంయమాన్ని రక్షించుకోలేక ముఖం తప్పించారు. భారద్వాజీ! నీ కటాక్షవీక్షణాలకొరకై ఎవరు వ్యాకుల పడలేదు ?

లోపాముద్ర:—అయినా (నవ్వుతూ అగస్త్యుని హృదయాన్ని చూపించి) ఈ హృదయంలో ఒక్కతరంగంకూడా లేచి నట్లులేదు.

అగస్త్యుడు:—అవును. అగస్త్యుడు ఇంకా పథభ్రష్టుడు కాలేదు. (కఠోరంగా) నన్నుతప్ప నీవు ఎంతమందినైనా ఉన్మత్తులనుగా చేయగలవు. భారద్వాజీ ! నీ స్వాచ్ఛంద జీవనం కారణంగా ఆర్యజాతి పతితమైపోతున్నది.

లోపాముద్ర:—మహర్షీ ! నీకు ఏమి జవాబుచెప్పవలెనో తోచడంలేదు. నన్ను స్వీకరించనంతవరకూ మైత్రావరుణుల ఆర్యత్వం అసంపూర్ణంగానే ఉండిపోతుంది. నెలల తరబడిగా నేను మిమ్ము పరీక్షిస్తున్నాను. గర్వభావాన్ని వదలి మీ హృదయాన్ని పరీక్షించుకొని చూడండి.

అగస్త్యుడు:— రేపుఉదయం ఎలాగూ వెళ్ళిపోతున్నావు.

ఈ కొద్దికాలంలో సంయమాన్ని వదలడ మెందుకు?
చేసినదానికి పశ్చాత్తాపంతప్ప ఇంకేమీ మిగలదు.

లోపాముద్ర:—రాత్రిని ఇలాగే ఉంచమని సవితృదేవతను ప్రార్థిస్తాను. (దగ్గరకువచ్చి ప్రార్థిస్తుంది.) అగస్త్యమహర్షీ! అభిమానాన్ని వదలండి. రాజ్యకార్యచాతుర్యాన్ని మరచిపొండి. రండి.

అగస్త్యుడు:— (దూరంగా వెళ్ళిపోతాడు కఠోరంగా) నారీ! ఏమిటి నీ ప్రలాపము? నన్ను లోభ పెట్టడానికి ప్రయత్నం చేస్తున్నావా? అసలు నీ వెవతెవు?

(క్షణకాలం లోపాముద్ర నిశ్చేష్టురాలవుతుంది. మరు క్షణంలో స్వస్థత చెందుతుంది.)

లోపాముద్ర:— నే నెవతెనా? మహామునీ! మీరు ఋతాన్ని ఆరాధించారు. స్వభావం ఉగ్రంగా ఉన్నా సంయమంగా ఉన్నారు. మీ దివ్యతపో ప్రభావంవలన రాజసింహాసన ప్రభావాన్ని గూడా ఎందుకూ కొరగాకుండా చేశారు. మీ రడిగిన ప్రశ్నను మీ హృదయాన్నే ప్రశ్నించుకోండి. మీరు సత్యసంధులుగదా!! – నే నెవతెనో మీరే చెప్పండి.

అగస్త్యుడు:—అవును. నీ వెవతెవు? నీలో స్వర్గ నరకాలు రెండూ ఉన్నవి. దేవతలూ, అసురులూ ఇద్దరూ నీలో నివసిస్తున్నారు. నీ రోమ రోమంలో నుండి కామవాంఛ ప్రస్ఫుటిత మవుతున్నది.

లోపాముద్ర:—ఓ అభిమానీ! మీ కామవాంఛను నాలో

దర్శిస్తున్నారు. నేను నా భక్తుల పూజారిణిని. నా కవుల కవితను. నన్ను సామాన్యురాలనని మీరనుకొంటున్నారని ఈనాటివరకు అనుకోలేదు. మీమాటలన్నీ అయినట్లే గా. ఒక్కసారి — చివరిసారి — నే నెవ్వతెనో చెపుతాను వినండి. గర్విష్టుడా! ముల్లోకాలలో సంచరించినా నాలాంటి సహచరి మీకు లభించదు. కళ్ళుఉండికూడా ఎందుకు అంధులవుతారు? (నెమ్మదిగా) నే నెవ్వతెను? విశ్వరథుని కూడా మీరు గుర్తించడంలేదు. విశ్వరథుని మాటలలో, చేష్టలలో, భావాలలో మీ, నా రేఖలు కనపడడంలేదా? అగస్త్యమహర్షీ! అతని బుద్ధినీ, అతనికిగలిగే ప్రేరణనూ మనమిద్దరమూ కలిసి నిర్మించాము. మీరూ నేనూ కలిసి చేసినసృష్టి విశ్వరథుడు.

(వెక్కి వెక్కి ఏడుస్తుంది. క్రింద కూర్చుంటుంది. అగస్త్యుడు పిచ్చివానిలాగా చూస్తూ ఉంటాడు. లోపాముద్ర అగస్త్యుని ముఖంవంక చూస్తూ ఉంటుంది.)

అగస్త్యుడు:—వాసనామూర్తీ! వలలో పక్షిని చిక్కించుకొంటున్నావు.

లోపాముద్ర:—మైత్రావరుణా! నా సర్వస్వాన్నీ నీకు సమర్పించాను. మీరు చెప్పినది నేను వింటాను. నాతో రండి.

అగస్త్యుడు:—అది ఎన్నటికీ జరగదు.

లోపాముద్ర:—అయితే లోపాముద్ర ఒకనిని వరించింది, తిరస్కరించబడింది అని అనిపించుకోవలసిందేనా? మహర్షీ

మీరు బయటికి హిమవంతునివలె శీతలంగా ఉన్నట్లు కన్పిస్తున్నారేగాని లోలోపల మీ హృదయం తప్తజ్వాలా ముఖివలె కుతకుత లాడుతున్నది. ఇప్పుడు నన్ను వదలి పెట్టినా తరువాత నాకొరకై మీరు స్వయంగా పరుగెత్తు కొనివస్తారు. ఉపహారంగా సమర్పింపబడిన హృదయాన్ని స్వీకరించడంలేదు. కాని చివరకు మీ హృదయాన్నే ఉపహారంగా నాకు సమర్పిస్తారు.

(రోహిణి పరుగెత్తుకుంటూ వస్తుంది)

రోహిణి:—భగవతీ! భగవతీ! పదండి. పదండి. శాంబరికి ప్రసూతిసమయం సమీపించింది. శీఘ్రంగా పదండి.

లోపాముద్ర:— (భయపడి) ఓ దేవా! మైత్రావరుణా! అర్ధరాత్రిసమయంలో నన్ను ఇక్కడనే కలుసుకోండి. నేను మీరాకకు ఎదురుచూస్తుంటాను. మరవకండి. నామీద వొట్టు. (రోహిణితో కలసివెళ్ళిపోతుంది) అగస్త్యుడు కళ్ళుమూసుకొని ఉదాసీనంగా చెట్టుమొదలులో కూర్చుంటాడు.

(తెర పడుతుంది)

# ఐదో దృశ్యం

(అర్ధరాత్రి సమయం. చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. వెన్నెల మనోహరంగా ఉన్నది. అశ్వత్థవృక్షం నీడను అగస్త్యుడు కళ్లుమూసుకొని పడిఉన్నాడు. అగస్త్యునికి ఏదో స్వప్నం వచ్చినట్లున్నది. దీర్ఘంగా నిట్టూరుస్తున్నాడు. నెమ్మదిగా వశిష్ఠుడు ప్రవేశిస్తాడు. కొంచెంసేపు అగస్త్యునివంక తదేక ధ్యానంగా చూసి నెమ్మదిగా శిరస్సుమీద చెయ్యి పెడతాడు. అగస్త్యుడు ఉలిక్కిపడి లేచికూర్చుంటాడు.)

అగస్త్యుడు:— ఎవరు ?

వశిష్ఠుడు:—నేను వశిష్ఠుణ్ణి.

అగస్త్యుడు:—(చంద్రునివంక చూచి) నేను ఎంతసేపు నిద్ర పోయినాను ? అర్ధరాత్రి అయినట్లున్నది.

వశిష్ఠుడు:—ఇంకా కొంతసమయ మున్నది. మీరు జ్వరప్రకోపంలో ఉన్నట్లున్నారు.

అగస్త్యుడు:—అవును. ఆరోగ్యం అంత బాగాలేదు.

వశిష్ఠుడు:—మైత్రావరుణులు అస్వస్థులయితే పృథ్వి కంపించి పోతుంది.

అగస్త్యుడు:—వశిష్ఠా ! నీకున్న సంయమమూ, శాంతీ ఇంకా నాకు లభించలేదు.

వశిష్ఠుడు:—కావచ్చును. సోదరా ! మనం ఎప్పుడూ హృద

యం విప్పుకొని మాట్లాడుకొంటూ వచ్చాము. మీ యీ స్థితి శోభాజనకంగా లేదు.

అగస్త్యుడు:—ఏ స్థితి ?

వశిష్ఠుడు:—మీ కేదో భయంకరమైన స్వప్నం వచ్చినట్లున్నది. క్షణంలో నవ్వడం, క్షణంలో దీర్ఘనిశ్వాసాలు వదలడం, ప్రారంభించారు.

అగస్త్యుడు:—ఏమంటున్నావు ?

వశిష్ఠుడు:—క్షమించండి. స్వప్నంలో ఎవరినో సుందరీమణిని చూసినట్లున్నారు.

అగస్త్యుడు:—విచిత్రం.

వశిష్ఠుడు:—ఎవరో సుందరీ మణి చికురజాలం మిమ్మల్ని చుట్టిముట్టినట్లూ, ఆచికుర జాలాన్ని మీరు సరిదీసినట్లూ మీ మాటలు వ్యక్తీకరించినవి. మీ చుంబనం వర్షబిందువు వలె నలువైపులా వ్యాప్తమయింది. మైత్రావరుణా ! మీరు హఠాత్తుగా ఉలిక్కిపడి లేచారు.

అగస్త్యుడు:—(ఆత్మ తిరస్కారపూర్వకంగా) వశిష్ఠా ! నా శాంతి అపహరించ బడినది.

వశిష్ఠుడు:—దేవులకు ప్రియుడవైన అగస్త్యమహర్షీ ! మీరు ఆర్యత్వం మూర్తీభవించిన అవతారమూర్తులు. ఈ స్థితిలో మీరు శోభించరు.

అగస్త్యుడు:—వశిష్ఠా ! నా జీవితంలో కొద్ది ఘడియలు మాత్రము మిగిలిఉన్నవి. అర్ధరాత్రి కావడానికి ఇంకా ఎంత సమయముంటుంది ?

వశిష్ఠుడు:—ఇంకా సమయమున్నది. ఎందుకు అలా ప్రశ్నించారు ?

అగస్త్యుడు:—ఏమీ లేదు. పద. శాంబరికి ప్రసవసమయం సమీపించింది. ఈ విషయం నీకు తెలుసునా ?

వశిష్ఠుడు:—భారద్వాజి రేపు ఉదయం ఎందువల్ల వెళ్ళిపోతున్నది ?

అగస్త్యుడు:—ఎవరు ? లోపాముద్రా ? అవును. ఎందువల్ల ... ఏమిటో,

వశిష్ఠుడు:—(దీర్ఘంగా నిట్టూర్చి) ఆమె వెళ్ళిపోవడమే మంచిది. అది మనోమోహకమైన విషపు పువ్వు.

(అగస్త్య వశిష్ఠులు ఇద్దరూ ఉదాసీనంగా వెళ్ళిపోతారు (లోపాముద్ర, రోహిణి ఇద్దరూ ప్రవేశిస్తారు, ఇద్దరూ వ్యాకులంగా కనపడతారు )

లోపాముద్ర:—కష్టాలు తగ్గడానికి బదులు పెరుగుతున్నవి. శాంబరికి మగపిల్లవాడు జన్మించాడు. ఇక ఎలాగో ?

రోహిణి:—పిల్లవాడు ఎంత అందంగా ఉన్నాడు ! విశ్వరథునికి ప్రతిబింబమే. తల్లిరంగు పిల్లవానికి అంటనే లేదు.

లోపాముద్ర:— శాంబరిని నా ఆశ్రమానికి తీసుకొని పోదామంటే విశ్వరథుడు అంగీకరించడం లేదు. శాంబరితోనే బాధపడుతూ ఉంటే మగపిల్లవాడుకూడా జన్మించాడు. సూర్యోదయసమయం కావస్తున్నది. ఏమీ ఉపాయం

తోచడంలేదు. (వెనకనుండి ఎవరో వస్తున్న అలికిడి విన పడుతుంది)

(నేపథ్యంలో ఋక్షుడు)

భగవతి ఇక్కడనే ఎక్కడో ఉండివుంటుంది.

రోహిణి:—ఋక్షుడు వస్తున్నట్లున్నాడు.

(ఋక్షుడు అజీగర్తుడు ఇద్దరూ ప్రవేశిస్తారు)

ఋక్షుడు:—భగవతీ! ప్రణామం.

లోపాముద్ర:—ఏమి ఋక్షా! మీరిద్దరూ ఇటువచ్చారు?

అజీగర్తుడు:—రేపు ఉదయం మీతోగూడా తప్పకుండా రాగలనని చెప్పడానికి వచ్చాను.

లోపాముద్ర:—నీ భార్య ప్రసవించేరోజు లన్నావు?

ఋక్షుడు:—భగవతీ! ఆమె ప్రసవించింది.

అజీగర్తుడు:—చచ్చిపోయిన శిశువు జన్మించాడు.

లోపాముద్ర:—(ఆశ్చర్యపడి) ఆఁ!!! (ఆలోచిస్తుంది)

అజీగర్తుడు:—అవును. నా భార్యను పుట్టింటిలో విడిచిపెట్టి మీతో రాగలను.

లోపాముద్ర:—(ఏమో నిశ్చయించుకొంటుంది) ఋక్షా! సరస్వతీ నదీతీరంలో విశ్వరథు డుంటాడు. వెళ్ళి పిలుచుకొని రా. పో.

(ఋక్షుడు వెళ్ళిపోతాడు.)

లోపాముద్ర:—అజీగర్తా! నీవు నాతోబాటు వస్తావుగదూ?

అజీగర్తుడు:—అందుకు సంశయ మేమున్నది?

లోపాముద్ర:—నిజం చెప్పమంటావా? నేనందరినీ ఇక్కడనే వదలిపెట్టి వెళ్ళిపోదామనుకొంటున్నాను.

అజీగర్తుడు:—మమ్మల్ని అందరినీ వదలిపెట్టి వెళ్ళిపోతారా!

లోపాముద్ర:—నిన్ను మాత్రం తీసుకొని పొమ్మంటావా?

అజీగర్తుడు:—తప్పకుండా. లేకపోతే సరస్వతీనదిలో మునిగి మరణిస్తాను.

లోపాముద్ర:—కాని నిన్ను నేను విశ్వసించేదెలా?

అజీగర్తుడు:—మీరు ఏది చెప్పితే అది చేస్తాను.

లోపాముద్ర:—అయితే నీ భార్యను నీతో గూడా తీసుకొని వస్తావా?

అజీగర్తుడు:—(భయపడి) మీరు ఆమెను చూడలేదు. ఆమె రాక్షసి.

లోపాముద్ర:—నేనున్నానుగదా? నీకా భయం అక్కరలేదు. (నెమ్మదిగా) అజీగర్తా! మరణించిన శిశువు జన్మించిన విషయం ఎవరికెవరికి తెలుసును?

అజీగర్తుడు:—నా భార్యకు, ఋషునికిమాత్రం తెలుసును.

లోపాముద్ర:—అయితే మంత్రబలంవలన లోపాముద్ర ఆ శిశువును బ్రతికించినదని ఆ ఇద్దరితో చెప్పు. నీ కుమారుని తెచ్చి రోహిణికి సమర్పించు. రోహిణి జీవించిన శిశువును నీకు అప్పగిస్తుంది. పరుగెత్తు. వెళ్ళితీరాలి. నీ కింకా పిల్లలున్నారా?

అజీగర్తుడు:—ఇంకొక మగపిల్లవాడున్నాడు.

లోపాముద్ర:—నీ భార్య, పిల్లవాడు, నీవూ అందరూ ఆ నావమీద బయలుదేరండి. నేను ఉదయమే వస్తాను.

అజీగర్తుడు:—భగవతీ! నన్ను చరితార్థుని చేశారు.

లోపాముద్ర:—రోహిణీ! ఇతనితో కూడా వెళ్ళు. పని పూర్తి చేసి శాంబరిదగ్గరకు వెళ్ళికూర్చో. నే నిప్పుడే వస్తాను.

(రోహిణి, అజీగర్తులు వెళ్ళిపోతారు.)

లోపాముద్ర:—ఇక బాధ తప్పినట్లే. అగస్త్యమహర్షి అంగీకరిస్తారా? (ఆర్తస్వరంలో) ఉషాదేవీ! (నెమ్మదిగా విశ్వరథుడు ప్రవేశిస్తాడు.) (లోపాముద్ర కొంతసేపు ధ్యానమగ్నురాలై ఉంటుంది. విశ్వరథుని చూస్తుంది) విశ్వరథా! పుత్రకా! (భుజంమీద చేయివేసి) ఒక్కమాట చెపుతాను. నీవు విచారపడకూడదు.

విశ్వరథుడు:—భగవతీ!

లోపాముద్ర:—శాంబరికి మగపిల్లవాడు జన్మించాడు. కాని ఆ పుణ్యాత్ముడు మర్త్యలోకంలోనికి రాకపూర్వమే యమలోకదర్శనానికి వెళ్ళిపోయినాడు.

విశ్వరథుడు:—(దీర్ఘంగా నిట్టూర్చి) వెళ్ళిపోయినాడా? మంచి పని జరిగింది. అతని తల్లిదండ్రులకంటే యమరాజే ఆ పిల్లవానిని ప్రేమగా పెంచుతాడు. కొద్దిసేపటిలోనే నేనూ ఆ పిల్లవానిని కలుసుకొంటాను.

లోపాముద్ర:—విశ్వరథా! (నెమ్మదిగా) గురుదేవులు తమ ప్రతిజ్ఞను ఉపసంహరించుకొంటే?

విశ్వరథుడు:—ఏమన్నారు? అగస్త్యమహర్షి ప్రతిజ్ఞను ఉప సంహరించుకొంటారా?

లోపాముద్ర:—శాంబరికి ఆర్యత్వం లభించినదని అంగీకరిస్తే!

విశ్వరథుడు:—అది సంభవమా?

లోపాముద్ర:—సంభవమయితే?

విశ్వరథుడు:—దేవతలు నామీద దయగలిగి ఉన్నారని తెలుసుకొంటూను. భగవతీ! గురుదేవుని ఆశీర్వాదం లభిస్తే మూడు క్రొత్తలోకాలను సృష్టిస్తాను.

లోపాముద్ర:—ఆశీర్వాదం తప్పక లభిస్తుంది. ఆర్యుల సంకుచితదృష్టి విశాలంకాక తప్పదు. దేవతలుగూడా విసుగు జెందిఉన్నారు.

విశ్వరథుడు:—(భావావేశంలో)గురుదేవుని ఆశీర్వాదం లభ్యమైతే నేను మిమ్మల్ని వెళ్ళిపోనీయను. మీరు లేనిది నాకు ప్రేరణ కలుగజేసేవా రెవరు? అంధకారంలో నుండి వెలుగులోనికి తీసుకొని వచ్చేవా రెవరు?

లోపాముద్ర:—విశ్వరథా! నేను స్వేచ్ఛగా విహరించేదానిని. నే నెక్కడఉన్నా మాతృదేవతవలె నిన్ను కనిపెట్టి ఉంటాను.

(తల్లివలె ఆలింగనం చేసుకొంటుంది)

విశ్వరథుడు:—వరుణుని ఆరాధించే విధానాన్ని మీరు గాక నాకింకెవరు బోధపరచగలరు?

లోపాముద్ర:—పుత్రకా! వరుణుని ఆరాధించే విధానం

నీకంటే మాకు ఎక్కువ తెలుసునా ? లేదు. అన్వేషించే వానికే మార్గం లభిస్తూ ఉంటుంది.

విశ్వరథుడు:—(ఖేదంగా) ఆర్యులు తమలో తాము కొట్టుకొని చస్తున్నారు. దివోదాసునికి ఉపాయమేమీ తోచడం లేదు. గురుదేవులూ అలసిపోయినారు. మార్గం లభించే దెలా ?

లోపాముద్ర:—(విశ్వరథుని భుజంమీద చేయివేసి) విశ్వరథా! నీ కోర్కె విషయం ముఖ్యంగా చెప్ప దలచుకొన్నాను. రాజ్యసింహాసన కాంక్ష నీకు వద్దు. వైవస్వతమనువూ యయాతిచక్రవర్తీ వెళ్ళిపోయినారు. వారి రాజదండా లేవి ? వారి సింహాసనా లేమైపోయినవి ? నీ మాటలు జనపతులకు తగినవి కావు మహర్షికి తగినవి.

విశ్వరథుడు:—భగవతీ !

లోపాముద్ర:—నీవు ఇంత చిన్నవయస్సులోనే మంత్రదర్శనం చేయగలిగినావు. ఋతాన్ని స్వయంగా దర్శించు. సమస్త జగత్తుకూ ఋతదర్శనం చేయించు.

విశ్వరథుడు:—ప్రయత్నం చేస్తాను.

లోపాముద్ర:—పుత్రకా ! శ్రద్ధనుకోల్పోకు. నా హృదయం లోని మంత్రం నీ జిహ్వాపై నాట్యమాడింది. మనుష్యుల నందరినీ ఆర్యులను చేయగలిగిన నీకు ఇవిగో నాజోహారులు,

విశ్వరథుడు:—ఇది తమ అనుగ్రహమే. (దూరంగా ఆకాశం వంక చూస్తూ కంపించడం ఆరంభిస్తాడు, ఏదో స్వప్నంలో ఉన్నట్లు మాట్లాడుతాడు.) ఆర్యత్వం దేహానికి సంబధించి

నదా, హృదయానికి సంబంధించినదా? తల్లిగర్భాశయమూ లేక దైవకృపయూ... ...నిజమూ... ...నిజము... ... ఈ నిరంతరసంగ్రామ ఫలితాన్ని ... ... నేను చూస్తున్నాను. దేవాధిదేవా! వరుణదేవా!! సమస్తవిశ్వానికీ ఋతదర్శనం చేయించు. రాజన్ ! నాకు చక్షువులను ప్రసాదించు. నాకు బుద్ధిని ప్రసాదించు. (లోపాముద్ర పాదములకు నమస్కరిస్తాడు) భగవతీ ! మీరు నవజీవనాన్ని నాకు ప్రసాదించారు. నేను వరుణదేవుని దర్శించాను.

లోపాముద్ర:—(విశ్వరథుని శిరస్సును ఆఘ్రాణించి) పుత్రకా ! దేవతలు నీకు శుభాన్ని ప్రసాదిస్తారు. ఆర్య జాతిని ఉద్ధరించు. ఆర్యజాతిని ఉద్ధరించు. (నలువైపులా చూచి) శాంబరి ఎదురుచూస్తూ ఉంటుంది. పద, పోదాం.

(లోపాముద్ర విశ్వరథుడు వెళ్ళిపోతారు.)

(అగస్త్యుడు ప్రవేశిస్తాడు. ఆయన కంఠస్వరం కంపించి పోతున్నది)

అగస్త్యుడు:—ఇదేమిస్థితి ? లోపాముద్ర విషయమేతప్ప రెండో ఆలోచన రావడమే లేదు. అర్ధరాత్రి అయిందా ? (పళ్ళుకొరికి) అగస్త్యా ! నీ పుణ్యం నేటితో సమాప్త మయింది. వశిష్ఠునికి మాట ఇచ్చాను. కాని అభిసారిక కొరకై రానేవచ్చాను. వాసనాదేవీ ! నన్ను వదలు. నన్ను వెళ్ళిపోనీ. (వెళ్ళిపోబోతూ మళ్ళీ ఆగుతాడు) రేపు ఉదయం నేను పితృలోకానికి వెళ్ళిపోతాను. ఒక్కసారి ఆమెను చూచియే పోతాను.

(వృక్షం మొదట్లో కూర్చుని ఎదురు చూస్తుంటాడు. లోపాముద్ర కంఠధ్వని దూరంగా వినపడుతుంది. లేచి చెట్టు చాటునకు పోతాడు. లోపాముద్ర ప్రవేశిస్తుంది)

లోపాముద్ర:—అర్ధరాత్రి అయినది. కాని మైత్రావరుణులు రాలేదు. రాలేదు. మైత్రావరుణులు నా ప్రార్థనను మన్నించడం లేదు. నా హృదయాన్ని నిరాశపరుస్తున్నారు.

అగస్త్యుడు:—(బయటకు వచ్చి) సుందరీ! నీవు స్త్రీవా, రాక్షసివా లేక దేవకన్యవా ?

లోపాముద్ర:—(హర్షాతిరేకంతో) వచ్చారు—నా మైత్రావరుణులు వచ్చారు.

అగస్త్యుడు:—అవును. వచ్చాను. నీ పనులు చూడడానికి వచ్చాను. నిన్నే తిరస్కరించాలో, లేక నన్ను నేనే తిరస్కరించుకోవాలో తెలియడం లేదు.

లోపాముద్ర:—కాదు మహర్షి! కాదు. మీ హృదయమే మిమ్ము నాదగ్గరకు తీసుకొని వచ్చింది.

అగస్త్యుడు:—నీవు ఇప్పుడిప్పుడే అర్థమవుతున్నావు.

లోపాముద్ర:—విన్న గీతాలకన్న వినని గీతాలే ఎంతో మధురంగా ఉంటవి. (దగ్గరకు వచ్చి అగస్త్యుని భుజం మీద చెయి వేస్తుంది.) విన్నారా? నేను నిలబడి ఉన్నాను—

అగస్త్యుడు:—లోపాముద్రా! నన్నెందుకు వేధిస్తావు? నీ యీమాటలు పాపపుణ్యాలన్ను మరిపింప జేస్తున్నవి. నీ పెదవులు నన్ను ఉన్మత్తుని చేస్తున్నవి.

లోపాముద్రః— మహర్షీ ! మీరు బాధపడుతున్నారు. నన్ను బాధపెడుతున్నారు. నాస్థితి అర్థం కావడంలేదా ?

అగస్త్యుడుః—లోపాముద్రా ! నీశక్తి అద్భుతమైనది.

లోపాముద్రః—కాదు అగస్త్యా ! నేను అకించనురాలను. నా గీతము, నా హాస్యము, నా నృత్యము అన్నీ మీరు లేక నిర్ప్రాణమై ఉన్నవి. ప్రణయం నన్ను కాల్చి భస్మం చేస్తున్నది. మీ అధరాలను – మీ ఆలింగనాన్ని కోరే గాఢవాంఛనుగా మాత్రం నేను మిగిలిపోయినాను.

అగస్త్యుడుః— ఓ తేజోనిర్మిత దివ్యప్రతిమా ! నన్ను అంధుణ్ణి చేస్తున్నావు. (కుంఠితస్వరంతో) రాక్షసీ, దేవీ, మహర్షీ ! నీవెవరవైనాసరే, నన్ను ముక్తుణ్ణిచేయి.

లోపాముద్రః—నాథా ! (చేతులు జాపి) అమృతరస దానం చేయండి. సత్యధర్మ్మలైన మన పూర్వజులు ఏవిధంగా తమ పత్నులను స్వీకరించారో అదేవిధంగా నన్ను స్వీకరించండి.

అగస్త్యుడుః—నిజం చెప్పుతున్నావా ?

లోపాముద్రః—అవిశ్వాసీ ! ఇంకా సందేహంగానే ఉన్నదా ? మిమ్ముచూడగానే కుంజకుంజంలో నందనవన దర్శన మవుతున్నది. వృక్షవృక్షంలో అమృతజలకణాలు సంచిత మవుతున్నవి దేవభూమికి సంబంధించిన పరిమళము దిగంతవ్యాప్తమై నా హృదయంలోనుండి ప్రసరిస్తున్నది.

అగస్త్యుడుః—(దగ్గరకు వస్తాడు.) కాని, కాని వశిష్ఠుడు

ఏమనుకొంటాడో? భరతు లేమంటారో? అగస్త్యుడూ అందరిలోటి వాడేనంటారు వారు.

లోపాముద్ర:— లోకు లేమనుకొంటారో ననే భయంతో నన్ను స్వీకరించకపోతే మీరు అంధులై పోతారు. నిజమైన ప్రేమకూడా ఋతమే. అదిమీకు ఋతంగా కనపడకపోతే మహర్షి! మీరు దయచేయవచ్చును.

అగస్త్యుడు:—నేను వెళ్లిపోతే నీగతి?

లోపాముద్ర:—(ఖేదంగా!) నా గతియా? (కూర్చొని కన్నీరు కారుస్తూ) నేను ఈనాటిరాత్రి ప్రేమవిహ్వలుడై నాముందు నిలబడిన అగస్త్యుని ఎల్లప్పుడూ స్మరించుకుంటూ బ్రతికి టాను. ఆర్యులకు దూరంగా - దూరంగా - ఏవిజనవనం లోనికో వెళ్ళిపోయి మీ నామస్మరణ చేసుకొంటాను. (అగస్త్యుడు ప్రేమవిహ్వలుడై దగ్గరకు వచ్చి నిలబడ తాడు.) మీస్మృతులు నిస్తబ్ధ, నీరవాకాశంలో మిణుకు మిణుకుమనే తారికలవుతవి. తమ మందమధుర ప్రకాశం తో నా హృదయపులోతులలో వెలుతురును వ్యాపింప జేస్తవి. ఏకాంతంలో సూర్యుడుకూడా ఎన్నడూవినని విరహగీతాలను గానంచేస్తాను. (ఏడుస్తుంది.) మీ చుంబ నం కొరకై ఎదురుచూచిన ఈ అధరాలతోనూ, మీ బాహుపాశంలో ఆబద్ధాలు కావడానికి ఉవ్విళ్లూరిపోయిన ఈ బాహువులతోనూ - నేను-యమసదనానికి ప్రయాణ మవుతాను. (ముఖం క్రిందకు వాలుస్తుంది. కన్నీరు బొట బొట కారుతుంది.)

అగస్త్యుడు:—లోపాముద్రా! కన్నీరు కార్చకు. ఇటు చూడు.

(లోపాముద్ర వెక్కి-వెక్కి- ఏడుస్తుంది)

అగస్త్యుడు:—(లోపాముద్ర శిరస్సును చేతితో నిమురుతూ) లోపాముద్రా! ఇటుచూడు. నా రక్తం ఊడు కెత్తుతున్నది. నీ యీ స్నిగ్ధకేశ రాశిలో నా హృదయం... ....

లోపాముద్ర:—అగస్త్యమహర్షి! మీకు ఆజ్ఞాపించడమే కాని కాతరులుకావడం తెలియదు. మీరు ప్రతాపాన్ని అర్థం చేసుకోగలరు, కాని ప్రణాయాన్ని అర్థంచేసుకోలేరు. సర్వస్వ సమర్పణానందం చవిజూచేభాగ్యం... .... ...

అగస్త్యుడు:—(లోపాముద్ర బుగ్గలను చేతితో నిమురుతాడు) భారద్వాజీ! ఈ గులాబీదళాలను ఏ వసంతుడు సృష్టించాడో తెలియదు. ఏ ఋతురాజు నీ నవయౌవనాన్ని వికసింపజేశాడో? నీ మధురశబ్దాలను వింటున్నకొద్దీ నేను ఏమో అయిపోతున్నాను. నావంక చూడు.

లోపాముద్ర:—(పైకిచూచి) మైత్రావరుణు లేనామాట్లాడుతున్నది? పురోహితశ్రేష్ఠా! మీరు ఏమంటున్నారో ఆలోచిస్తున్నారా?

అగస్త్యుడు:—భారద్వాజీ! నా గర్వాన్ని చూర్ణంచూర్ణం చేశావు. కీర్తిప్రతిష్ఠలు కారణంగా లభించని పరమపదవిని ప్రసాదించావు. (భావావేశంతో) నాకు అభిమాన మెక్కుతున్నది? నీ పదచిహ్నాల వెనుకవెనుక తిరగవలెనని కోరుతున్నాను. ఇటుచూడు, ఇటుచూడు.

లోపాముద్ర:—నిజమా అగస్త్యా!

అగస్త్యుడు:— అవును లోపా! నా సహచరీ! నా పత్నీ! ఇటురా (లోపాముద్రను ఆలింగనం చేసుకొంటాడు.)

లోపాముద్ర:—నాథా! నా స్వప్నభరితదృష్టి మీ తేజస్సుపై ముగ్ధమైనది. నలుదిక్కులా వ్యాపించిన చంద్రికా ప్రకాశంలో ఉప్పొంగిపోతున్నాను. వనకుంజాల,సరిత్తుల-పర్వతశృంగాల అవతలి అంచులకు నన్ను తీసుకొనిపొండి. చూడండి - చూడండి - ఆ నక్షత్రం - తేజోబంధువు లాగా-మనకు పథప్రదర్శనం చేస్తున్నది. మహర్షీ! పదండి- ఆ శృంగాలనూ, ఆ సికతాతలాలనూ సంగీతమయంగా చేద్దాము. నా నావ తయారుగా ఉన్నది.

(అగస్త్యుడు రెండు అడుగులు వేస్తాడు.)

అగస్త్యుడు:—ఓ దేవా! నేనేమి చేస్తున్నాను?

లోపాముద్ర:—ఏమి చేస్తున్నారు? ఏమిటి?

అగస్త్యుడు:—నే నెలా రాను? ఎక్కడికి రాను? సూర్యోదయం కాబోతున్నది. లోపాముద్రా! నా ప్రతిజ్ఞ జ్ఞాపకం లేదా? నీతో సుఖమనుభవించే గీత నాకు లేదు. ఇంత కాలంనుండి నేను నిర్మించిన సప్తసింధుభవిష్యత్తు నా ప్రతిజ్ఞపై ఆధారపడి ఉన్నది.

లోపాముద్ర:—మైత్రావరుణా! శాంబరిని దేవతలు ఆర్యగా స్వీకరించినా మీరు స్వీకరించరా?

అగస్త్యుడు:— అనార్య ఆర్య కాగలుగుతుందా? దేవతలు ఎలా స్వీకరిస్తారు?

లోపాముద్రి:—విశ్వరథుడూ నేనూ కన్నారాచూచాము. దేవతలు అంగీకరించారు. నాథా! ఆర్యత్వం రంగులో కాదు, హృదయంలో ఉంటుంది. ఈ సిద్ధాంతాన్ని ప్రచారం చేయనినాడు సప్తసింధు ఉద్ధరింపబడదు. ఆర్య జాతికి విమోచనం ఉండదు.

అగస్త్యుడు:—నీమాటలమీద ఎందుకో విశ్వాసం కలుగుతున్నది. నీవూ విశ్వరథుడూ ఇద్దరూకలసి అనార్యులను ఆర్యులను చేస్తున్నారన్నమాట.

లోపాముద్రి:—నాథా! విశ్వరథుని శక్తిని గురించి ఎగతాళిగా మాట్లాడకండి. అతడు వీరుడు—వీరులలో మహావీరుడు. శబ్దసంజీవనికి ప్రభువు అతడు. దివ్యమైన ఋతాన్ని తప్పక దర్శిస్తాడు.

అగస్త్యుడు:—నీకు అంత విశ్వాసమున్నదా?

లోపాముద్రి:—అవును. ఉన్నది. మానవజీవితమనే తాళపత్రింపై అతడు వ్రాసినన్ని మంత్రాలను ఎవ్వరూ వ్రాయలేరు. విశ్వరథుడు మీ, నా మానసపుత్రుడు. అతనిని రక్షించండి. మిమ్మ భిక్షమడుగుతున్నాను.

అగస్త్యుడు:—నేను దేవద్రోహిని అయిపోనా? లోపా! అలాంటిభిక్ష మడగకు.

లోపాముద్రి:—ఓ తపస్వీ! నేను మీలో ఐక్యమైపోనా? మీ జీవితమే నా జీవితంకాదా?

అగస్త్యుడు:—కావచ్చును. అందుకనే మనం సహచరులంగా ఉండుటకు వీలులేదని చెపుతున్నాను.

లోపాముద్ర:—వరుణదేవా! ఈ ఇద్దరిలో ఒకరు సమాప్తం కావడం తప్పదా?

అగస్త్యుడు:—అది దైవాజ్ఞ.

లోపాముద్ర:—(పెద్దగా) నా జీవనాధారం నాకు దొరికింది. అతనినుండీ వేరై నే నెలా జీవించగలను? (అగస్త్యుని హస్తాన్ని తన హస్తంలోనికి తీసుకొంటుంది.)

అగస్త్యుడు:—ఏమీ ఉపాయంలేదు. ఆశ్రమానికి వెళ్ళిపో. నన్ను పథభ్రష్టుణ్ణి చేయబోకు. (లోపాముద్రను అవతలకు నడతాడు.)

లోపాముద్ర:—నేను ఎలా అవతలకు వెళ్ళను? (హృదయం బ్రద్దలవుతున్న ట్లనిపిస్తుంది) నేను వెళ్ళను—వెళ్ళను.

అగస్త్యుడు:—మనం కలుసుకొన్నాం. చాలు, లోపా. నా మాట విను. వెళ్ళు. మనం తపస్సు చేయవలసినవారం. మనకు జీవన్మరణాలు రెండూ సమానమే.

(హఠాత్తుగా చెట్లమధ్యనుండి ఏదో ధ్వని వినబడుతుంది. భైరవుడు భయంకరంగా అట్టహాసంచేస్తూ వచ్చి లోపాముద్ర మీద దూకుతాడు. వెన్నెలలో అతని చేతిలోనికత్తి తళతళ మెరుస్తుంది. అగస్త్యుడు అడ్డుపడకపూర్వమే లోపాముద్రను భైరవుడు కత్తితో పొడుస్తాడు.)

భైరవుడు:—ఈ, ఈ ఈ, ఊ.

లోపాముద్ర:—నేనుగూడా మీతోనే వస్తున్నాను.

(మూర్ఛితురాలవుతుంది)

అగస్త్యుడు:—(భైరవునితో కలియబడతాడు) చండాలుడా!

భైరవుడు:—(అగస్త్యుని కత్తితో పొడవబోతుంటాడు) ఉగ్రకాలకీ జయ్—(విశ్వరథుడు వచ్చి భైరవుని చేతిలోని కత్తిని లాగివేస్తాడు. భైరవుడు భూమిమీద పడిపోతాడు. విశ్వరథుడు భైరవుని చేతులు విరచి వెనకకు కడతాడు. అతని శరీరమంతటా రక్తం ధారలుకడుతూ ప్రవహిస్తూంటుంది.

విశ్వరథుడు:—(క్రోధపూర్వకంగా) భైరవా!

అగస్త్యుడు:—లోపా! లోపా!

రోహిణి:—(వెనుకనుండి తొందరగా పరుగెత్తుకొని వస్తుంది) శాంబరిని ఎవరో చంపివేశారు.

అగస్త్యుడు:—శాంబరినా?

విశ్వరథుడు:—(పళ్ళు కొరుకుతూ) ఎవరా దుర్మార్గుడు?

భైరవుడు:—(విజయోల్లాసంతో) ఎవరా? నేనే. నేను. శాంబరి ఉగ్రకాలునికి అపచారం చేసింది. (పళ్ళు పటపట కొరికి) రెండవ బలి ఈమె. మూడవబలి నీవు. (విశ్వరథునిమీద దూకుతాడు. విశ్వరథుడు భైరవుని ఎత్తి భూమిమీద విసురుతాడు. భైరవుడు భూమిమీద పడిపోతాడు. అతని నోటినెంట రక్తం ప్రవహిస్తుంది.)

విశ్వరథుడు:—వెళ్ళు – వెళ్ళు. ఉగ్రకాలుని దగ్గరకు వెళ్ళు. (అగస్త్యుడు విశ్వరథుని దగ్గరకు వస్తాడు.) రోహిణి లోపాముద్రదగ్గరకు వెళ్ళుతుంది)

భైరవుడు:—(విజయఘోష చేస్తూ) ఉగ్రకాలుడు ప్రసన్నుడైనాడు. ఉగ్రకాలునికీ జయ్. ఉగ్రకాలునికీ జయ్. ఉగ్రకాలునికీ జయ్.

(భైరవుడు చనిపోతాడు.)

అగస్త్యుడు:—శాంబరి మరణించింది. ఆమెతోబాటు... ...

విశ్వరథుడు:—(లోపాముద్ర దగ్గరకు వెళ్ళుతాడు) భగవతి !

అగస్త్యుడు:— లోపా ! నీవుకూడా శాంబరితో... ... ...

(దివోదాస వశిష్ఠులు పరుగెత్తుకొని వస్తారు)

దివోదాసు:—ఇదేమిటి ? (చూచి ఆగిపోతాడు) లోపాముద్రకుకూడా ప్రమాదం సంభవించిందా ?

(అగస్త్యుడు క్రిందకువంగి లోపాముద్ర శిరస్సును తన వొడిలోనికి తీసుకొంటాడు. ఆమె కళ్ళు తెరుస్తుంది. అగస్త్యుని మెడలో తన చేతులు వేస్తుంది.)

వశిష్ఠుడు:—(కఠోరంగా) మహర్షి ! ఇది ఏమిటి ?

అగస్త్యుడు:—(దుఃఖపూరిత స్వరంతో) వశిష్ఠా ! ఈమె నా సహధర్మచారిణి—దేవదత్త !

(తల క్రిందికివంచుతాడు. అందరూ ఆశ్చర్యంగా చూస్తూ ఉంటారు.)

తెర పడిపోతుంది.